—: కుకవినింద :—

కం. అందము చందము నెఱుఁగక
యందతుకుల రచనసేసి యందుకె మది నా
నందముఁ జెందెడు కుకవులు
నిందార్హులు గాక వర్ణనీయులె సభలన్ ? 10

వ. అని యిష్టదేవతా వందనంబును సుకవిగుణానందనం
బును గుకవి నిందనంబును గావించి యున్న సమయంబున. 11

సీ. కర్ణాట జయరమా కంఠసూత్రమునకు
మంగళం బే మహామహుని శౌర్య
మా సేతు శీతాచలాంతరాంతర్వాణి
గణనీయ మే రాజు గుణగణంబు
విశ్వాసభాగ్యశ్వ విశ్వంభరాధీశ
పాలనం బే మహీపాలువశము
నిఖిలకార్యాకార్య నిర్ణయ సరణికి
మను నీతు లేమేటి మాటనేర్పు

గీ. లతఁడు హరిదంత దంతావళాతి తరళ
కర్ణచామరబిరుద విఖ్యాతసౌమ్య
కీర్తినర్తన నుతి పరక్షితివరుండు
గరిమఁ జెలువొందు విజయరాఘువవిభుండు. 12

వ. ఒక్కనాఁడు మక్కువమీఱ నంతఃపురాంతర నిరం
తర శుభ విభవా చరణ నిపుణ రమా రమణీ రమణీయ తప
నీయ కమలకర్ణికాయమానంబును, విశృంఖల కనక శృంఖా
ళాందోళిత డోలికా చిరత్న రత్న నిర్యుక్త నిర్యద్విభా విభా

వనీయ బాలాతపాలోకన కౌతుకాలోల సవిధ కాసార తీర రంగ ద్రథాంగ సంఘంబును, వలమాన మలయ పవమాన కంపితసవిధ వివిధ శాఖి శాఖా శిఖాగ్ర జాగ్రత్కుసుమ సముదయ సముదయ త్సౌరభ లోభ పరిభ్రమత్ భ్రమర ఝుంకారానుకారి గాయనీగాన తానమాన మానితంబును, కాంత నిశాకాంత కాంత జాల కాంతరాంతర నిరంత రాగరు ధూప ధూమస్తోమ వారిధర వారిధారా సారసం దోహ సందేహావహ సుమనివహ కాయమాన వితాయ మాన పరిమళ ఝురీమిళ దవిరళ గళన్మధురస మధురరస కణగణమ్ముల వలన, తదీయ వనిత స్తనితభ్రమవిభ్రమావ హోత్తాళ తాళ పరిజ్ఞాన చాతుర్య ధుర్య చంచలలోచనా కరాంచల వాద్యమాన మర్దలీరవ సమ్మర్దంబు వలన, నగణ్యా నిజలావణ్యా కలా కలాప గ్రహణ నిపుణ దోషా యోషాతి ప్రబంధసంబంధ సమామ్నాత తదీయా ననుకరణీయ హృద్య వంశ వాద్య విద్యా వైశారద్యానవద్య చిరత్న రత్న పుత్రికా వైచిత్రి వలన, దేదీప్యమాన మాననీయ కనకారవింద బృంద స క్త ముక్తాహంస సంసదంసల క్రేంకార శంకా కరణ చణ హరిణ లోచనాచరణ రణన్మంజుమంజీర పుంజశింజితమ్ము వలన, తదంతర ప్రశంస్య లాస్య చికీర్షా హర్షాతిలోల లోతే క్షణా ప్రకర్ష ప్రసవ వర్షకరణ బహూకరణ విద్యాధర విద్యాధర వారాంగనా వారమోహావహా కుసుమ వర్షిత మాలాధర యంత్ర యంత్రిత కాంచన పాంచాలికా ప్రపం చంబువలన, పార్శ్వభాగ భాగాతి రమణీయ తపనీయ ప్రతి మా ప్రతిమాన కరనికరనీరాజన మరకత భాజన దేదీప్య మాన మాణిక్య దీప శిఖాముఖానుషజ్యమానకజ్జ లీరేఖా శ్లా

ఘూవహ మహనీయ మహానిల దామ హామంబువలన, ప్రతి స్తంభసము త్తంభిత శాతకుంభ రంభా సంభార సంభావనీయ సుమ సముదయ సమయ సముదయత్పరాగా భోగ మసీపా పోషక నటనానుకూల రంగోత్తరంగవికీర్య మాణ కర్పూర రజః పూరంబు వలన, నిగనిగని తొగరా చలుపగోడల జా డల జాలుకొను తెలినిగ్గు డాలను తేటనీటి జాలునం గందళిం చిన పొందమ్ములకు కెందమ్ములకు గమనించ గమకించు జక్కవ కవల యందచందంబుల నరజాలు పయ్యెదలం బొదలు గులుకుమిటారి వలిగబ్బిగుబ్బల చేత బొందుపఱుపుచు రంగారు శృంగారకృత్యములకై మెలంగు నంగనాజనంబు వలన, నందందు క్రందు కొను మందగమనల కందులేని నెమ్మొగమ్ముల సోయగమ్ముల వింతగొంత యుపలపించిన యపరాధం బపనయింపఁ దదీయ చరణ పరిచరణాచరణమ్ము నకై మగఱాతెగ రానెలవుల నెలకొన్న శశికాంత దర్పణ ప్రతిబింబంబుల దంభంబునం గాచియున్నశశిబింబంబుల తోటి పర్యాటంబున కొయ్యనొయ్యనం దారు తారకల తీరున మీఱువిన్నాణంపుటాణిము త్తెంబుల రంగారు రంగవల్లికల వలన, పవనవమ్ములగు ముఱముఱ రవమ్ములను బెడిదంపు టురుముల యురవడిం బరువడి మొలచిన రత్నంపుమొలకల జాజాలపాలికల పోలికం దనరం దనరు రోహణ ధరాధర కంధరంబు పొందుపఱచు పైగోవ కెంపురా చెక్కడంబుల డంబుల గొప్పటాకులం దీరిన చిత్తరువుల తీరువలకు, తొగ రుచిగురాకు జొంపమ్మున సొంపులు సంపాదించు దీపకళా ప్రతి బింబితమయూఖ రేఖల వలన, కురులు కూఁకటి తోడం గూడియుఁ గూడసి చిన్నారి పొన్నారి ప్రాయంబునం బరులం

దృణప్రాయంబు సేసి పట్టంబుఁగట్టుకొన్న గట్టితనంబుచూచి సహింపక మట్టుమీఱిన పాండ్యతుండీర కర్ణాట కరహాటాదు లం బంపుల నంపి వెంపరలాడించి పెంపుగనిన నిజవిజయాంక లేఖ్యంబులవలన,వలను గాంచి మించు నాకీర్ణ శిశిర పన్నీరంబు నాలిప్త కుంకుమ పంకంబు నాపూర్ణ పూర్ణకుంభంబు నాల క్షిత తోరణ ధోరణికంబు నాబద్ధ జాంబూనదాంబరంబు నాలంబిత చమరవాలంబు నాసంజితా నర్ఘ్య సింహాసనంబు నాపాదితాష్టాపద పాదపీఠంబు నాస్తీర్ణ వివిధ వర్ణాస్తరణంబు నాలక్షితశుభలక్షణంబునగు "విజయరాఘవవిలాసం" బను భవన రాజంబునందు. 13

కం. ధాటీజిత విమతావృత
కోటీర మణీ విశేష గుంభిత రుచులన్
కోటి రవి చంద్ర నిభమగు
హాటక మయ సింహపీఠికాంతరమందున్. 14

సీ. మహనీయ నవరత్నమయ భూషణ ద్యుతుల్
భూనభోంతరములఁ బొదివి కొనఁగ
కాశ్మీర కస్తూరికా సంకుమద సాంద్ర
సౌరభ విభవంబు సందడింప
కటి తటా భోగ సంఘటిత హాటకచిత్ర
వసనదీప్తులు చుట్టు వలగొనంగ
పాద పీఠోపరి భాగ సంవేశిత
పాదాంగదప్రభల్ పల్లవింప

గీ. తార గంభీర రవము లుదారముగను
జతన "సామి! పరాకు! హెచ్చరిక" యనుచు

హెగ్గడులు వేత్రములు పూని హెచ్చరింప
నిండు కొలువుండె యామేదినీవిభుండు. 15

చ. పడఁతి యొకర్తు గిండి, యొక బాలనిశాకరఫాల కుంచె, పా
వడ యొకవన్నెలాఁడి, యొక వారిరుహాయతనేత్ర వీజనం
బడపము భామ యొక్కతె, యొయారి యొకర్తు మణీకలాచికం
గడక వహించి చేరి సముఖంబునఁజిత్తమెఱింగి కొల్వఁగన్.

గీ. రత్నకంకణ ఘలసులా రవము గ్రమ్మఁ
గొమరు ప్రాయంపు గొమ్మలు కుందనంపు
బొమ్మ లెలవంక బలవంక బొదివి చెంత
చామరంబులు వీవంగ సరసలీల. 17

—: శారదాధ్వజ వర్ణన :—

సీ. ఒక్కొక్కయెడఁ జీనిచక్కెర పానకం
బాని నట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్కయెడఁ దావి నెక్కొన విరజాది
సరము లెత్తిన రీతి పరిమళింప
నొక్కొక్కయెడఁ జల్వ లుప్పతిల్లఁగ మంద
మారుతంబులు మించు మహిమ చెలఁగ
నొక్కొక్క యెడ మేనఁ జొక్కు సంపాదించు
వెలఁది వెన్నెలతేఁట విధము మించ

గీ. కవిత రచియింప విజయరాఘవ విభుండె
నేర్చునని వాణి నర్తించు నేర్పుమీఱ
చామరానిల కందళ చలితమగుచుఁ
దనరు సభయందు నల శారదాధ్వజంబు. 18

సీ. నవనవో ల్లేఖన నవనయోగ్యము గాని
పద్యంబు జనులకు హృద్యమగునె ?
ఘనతరాలంకార కారణంబులుగాని
వాక్యవైఖరుల నెవ్వారు వినరు
శేష భాషిత వాగ్విశేషాన్వితము గాని
పదము విద్వత్ప్రేమ పదము గాదు
ఘన సారసారంబు గాని సందర్భంబు
లర్భకులైనను నాదరింప

గీ. రంచు వివరించు చలచామరాంచదనిల
చలిత చేలాంచలాగ్రహస్తంబుచేత
విజయరాఘవ మేదినీ విభుని సభను
తనదు మహిమంబుచే శారదాధ్వజంబు. 19

—: కైవారము :—

మ. కలమంద్రోదిత రత్న కంకణ ఝణత్కారంబు తోరంబుగాఁ
దలిరుం దీవెలు చంచలించు గతి హస్తన్యాసముల్ మీఱఁగా
లలనల్ 'పాండ్యనృపాల మండలవిభాళా!" యంచుఁ గైవార
ముల్
వలనొప్పన్ రచియించి రంత నుచిత వ్యాపార పారీణతన్. 20

—: సభానాట్యవర్ణన :—

గీ. భరత సంగీత సాహితీ ప్రముఖ విద్య
లాకృతులు గన్న చందాన నబ్జముఖులు
సరస ముక్తాతపత్రచామరము లలర
వివిధ బిరుదాంక వాద్యముల్ వెలయనిల్వ. 21

సీ. తీగెమెఱుంగుల తీరున నిరుగడ
వరుస బంగారు పావడలు మెఱయ
పఱపుగా వలగొన్న భానుమండలముల
హరువున నపరంజి హరిగెలమర
మొగిలు మొత్తంబులు మోహరించినరీతిఁ
బ్రబ్బు సాంబ్రాణి ధూపమ్ములలర
విద్యావిశేషముల్ వేర్వేఱ వివరించు
హావణిక బిరుద వాద్యములు మొరయ

గీ. వీరవేంకటరాయ పృథ్వీమహేంద్ర
దత్త బహువిధ బిరుదముల్ దనరుచుండ
సముఖమున నిల్చి యాముద్దు 'చంద్రరేఖ'
వివిధవిద్యలు వినిపించె వింతయనఁగ. 22

సీ. చౌపద కేలిక 'రూపవతీ'కాంత
శబ్దచూడామణి 'చంపకాఖ్య'
చెలువగు జక్కిణి చెలువ'మూర్తి వధూటి'
కొరవు 'కోమలవల్లి' గురునితంబ
నవపదంబులు 'లోకనాయికా' లోలాక్షి
యలదేశి 'శశిరేఖ' కాబ్జనయన
దరుపదంబులు 'రత్నగిరి' నితంబినియును
పేరణి విధము 'భాగీరథి' యును

గీ. మదన పదదూర్యా నవరత్న మాలికాది
బహువిధా లక్ష్యనాట్య ప్రపంచమెల్ల
ఘనత విలసిల్లఁ దక్కిన కాంతలెల్ల
నభినయించిరి తమనేర్పులతిశయిల్ల. 23

సీ. వీణవాయించెను శోణాధర యొకర్తె
కిన్నరఁ బలికించె కన్నెయొకతె
చపలలోచన యొకర్తు ద్విపదలు చదివెను
తత్ప్రసంగముచేసె తరుణియొకర్తు
ముఖవీణచే నొక్క ముదితరాగముచేసె
కొమ్మ యొక్కతె పిల్లఁగ్రోవియూఁదె
తంబురా మొరయించె ధవళాక్షి యొక్కర్తె
స్వరమండలము మీటె సతియొకర్తు

గీ. యక్షగానంబు రావణహస్త ముడుకు
దండెమీటులు చెంగులు తాళములును
జోల సువ్వాల ధవళంబు లేల లమర
కొంద ఱతివలు వినిపించి రందముగను. 24

శా. విద్యామూర్తిమ లాగులెత్తు విధముల్ విద్యాధరుల్మెచ్చఁగా
విద్యుద్వల్లులు మింటనుండి విని యుర్విన్ డిగ్గిమేలైన యా
విద్యల్ తాము నభ్యసింప రమణీ వేషంబులం బూనె నా
వాద్యంబుల్ మొఱయంగఁ దక్కినసతుల్ వర్తిల్లి రాలాగునన్.

గీ. దండె మీటుచు భళిగాణ దండియనఁగ
నొదుగు గమకంబు రక్తియుఁ బొదివికొనఁగ
స్థాయి రాగప్రబంధముల్ తాయములును
గీతముం బాడెనొక రాజకీరవాణి. 26

సీ. ప్రస్తారసంఖ్యను పదుమూఁడు కోటులు
నలువది రెండులక్షలు పదేడు
వేలు నేభ్నూఱును వింశతియును నాఱు
వృత్తంబులందు నీవృత్తమునకు

నీవర్ణన సమస్య నీవుగూర్పు మటన్న
నా వృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకంబు లాశువుగాఁజెప్పి
యవి తెనుంగునను పద్యములుచేసి

గీ. ఇరువదాఱును ఛందంబు లెఱిఁగియిట్లు
కవితఁజెప్పిన వార లీ భువినిఁగలరె?
యనుచునందఱు వినుతింప ఘనతఁగాంచె
కీర్తనీయ గుణాలంబ 'కృష్ణమాంబ.' 27

గీ. ఇటుల విద్యలు వినుచు సాహిత్య విద్య
వినికి సేయఁగ ననుఁజూచి వేడ్కతోడ
విజయరాఘవ మేదినీ విభుఁడువల్కె
మధుర మధురస మధుర సామంబుఫణితి. 28

—: కవివంశ వర్ణనము :—

సీ. శ్రీవత్సగోత్రుండు శ్రీకర పాకనా
టార్వేల బంధుజనాతిశాయి
కాళయ మంత్రిపుంగవునకు గంగమాం
బకు నుదయించు తపఃఫలంబు
రణరంగ గంధవారణ బిరుదాంకిత
స్వకులజ శ్రీకంఠ సచివమౌళి
పార్వతీపరిణయ ప్రముఖ ప్రబంధ ని
బంధ ధురంధర ప్రౌఢఫణితి

గీ. యైన చెంగల్వ వేంకటయ్యయును రావి
నూతల తిరుమలయ్య తనూజ కృష్ణ

మాంబ మును గన్నవిధి కాళహస్తి గిరిశ
కలిత లలితోక్తి భారవి కాళసుకవి 29

సీ. ఘటికా శత గ్రంథ ఘటనోత్కట నవీన
పాండిత్య గరిమలు భళియనంగ
నోష్ఠ్య నిరోష్ఠ్యాది కోద్దామ రసగర్భ
సందర్భ మానని సన్నుతింప
మాకంద మంజరీ మధురఝరీ మాధుర్య
రచనా విశేష మారా యనంగ
పరిహృ తేతర యుక్తి భాగ నూతన కథా
చాతుర్య ధుర్యత సంస్తుతింప

గీ. అయ్యదినముల రామభద్రామ్మవారు
నేఁడు కృష్ణాజి కవితల నేర్పుమెఱసి
వినికి సేయుట లెల్ల మీఘనతఁగాదె
కవినినుతచర్య! చెంగల్వ కాళనార్య! 30

ఉ. భూనుతకీర్తులైన కవిపుంగవు లందఱు మెచ్చనిచ్చలున్
తేనియసోనలై, కసటుదేఱిన చక్కెరపానకంబులై
వీనులవిందులై, రసికవేద్యములై యల వాగ్వధూటికిన్
గానుకలయ్యె జెంగలువ కాళకవీ! భవదీయ కావ్యముల్. 31

మ. పదియార్వన్నె పసిండికిన్ వలపు పైపైఁ జెందు చందంబునన్
చదురుల్ మీఱు భవత్ప్రబంధ మిలనిచ్చల్ దక్షిణద్వారకా
సదనాస్థాన కథాను షంగములచే సంభావ్యమై మించె నేఁ
డది మాకంకిత మీవొనర్పుమని యాహ్లాదంబు సంధిల్లఁగన్.

సీ. అలసహ్యాజాతటి సగ్రహారంబులు
బహురేఖ మించు నుంబళిక యూళ్లు
బంగారు వనుసుల పచ్చలపల్లకి
పసిఁడికొమ్ముల కట్లభద్రకరులు
పడివాగె తేజీలు బంగారు కాళాంజి
హడపంబు చామరల్ హంసకంబు
తరమైన చౌకట్లు తారహారంబులు
నంగుళీయాది రాజార్హ భూష
గీ. తెలిమి నపరంజి హరివాణములును గిండ్లు
పెట్టెల కొలంది జాళెలు మట్టుమీఱి
నట్టి వైభోగపుం డచలాత్మ ఘనత
ననుగుణంబుగ దయచేసియపుడు మఱియు. 33

కం. కేళాకూళుల సజ్జల
కేళీవనములనుమించు గృహరాజంబున్
శ్రీలెసఁగ నొసఁగి లోకులు
మేలని కొనియాడ కరుణ మీఱఁగనంతన్. 34

గీ. విందునకుఁ దాము గఱితలు వేడ్కవచ్చి
వరుససొమ్ములు తమయింటి వారి కొసఁగి
యాత్మజులకెల్ల చతురంతయానములను
మహిత భూషణములు బహుమతులు చేయ. 35

ఉ. ఎంతటి భాగ్యశాలి యితఁడెంతటి ధన్యుఁడటంచు నెంచ శు
ద్ధాంతమునందు పాండ్యవసుధాధిపనందన లాదియైన యా
కాంతలు గొల్వ నన్ను సముఖంబునఁ గన్నులఁ గప్పు కొంచు న
త్యంత బహుకృతుల్ సలుపు నవ్విభువంశము సన్నుతించెదన్.

—: కృతిభర్తవంశము :—

సీ. కూట దానవ భద్ర కుంజరంబుల మించు
మదగర్వరేఖల మట్టుపఱుప
సంసార నైదాఘ సమయాతపంబులు
మించి యెల్లెడ విజృంభించకుండ
భజన వైభవ లోల సుజన మనోరథ
పూర్తికి నతిశయస్ఫూర్తి చూప
వందారు జనులకు వాంఛితంబులు గూర్చి
బిరుదంపు చిన్నెర పెఱిమ నెఱప

గీ. సంకుశ చ్ఛత్ర కలశ ధ్వజాంకనముల
వెలయ శ్రీహరి పాదారవిందమునను
సకలలోకైక నుతమైన జాహ్నవికిని
సహజ యైనట్టి నాల్గవజాతి దనరు. 37

కం. అందునొక కొంద ఱుదయం
బందిరి వసుధా సుధాంశు లంచిత బాహా
కందళిత తీవ్ర తేజః
కందళ దళితారి గర్వఘనశార్వరులై. 38

ఉ. వారలలోన కృష్ణజన వల్లభుఁ డెల్లరు మెచ్చ నిచ్చలున్
వారిధి మేఖలావలయ వాసవుఁడై విలసిల్లి దీనమం
దారుఁ డటంచు యాచకు లుదారత సన్నుతి సేయ మీఱెనా
మేరు వసుంధరాధిపులు మేర లెఱింగి తనున్ భజింపఁగన్. 39

క. ఆకృష్ణ ధరావరునకు

లోకోత్తర నయ వినయ వి
వేకోత్తరుఁడైన తిమ్మవిభుఁ డుదయించెన్. 40

సీ. తలఁపెల్ల వివరించి దాక్షిణ్య మనుకేమి
దుష్ట నిగ్రహముల త్రోవ మెలఁగ
వీక్షణంబులు చల్లవెదఁ జల్లఁగనుకేమి
విమతారి వరులపై వేఁడిసూప
మాటలు సత్యంబు మర్మంబు లనుకేమి
మానినీ వంచనా మహిమమించ
ననవరతంబు దానాధికుఁ డనుకేమి
యరులచే ధనము తానంది కొనఁగ

గీ. నిట్టి (వైచిత్రి తనయందెపుట్ట)గలిగి
యన్ని గుణముల వెన్నుండె యెన్ని చూడ
ననుచు జగమెల్ల గొనియాడ నతిశయిల్లె
ప్రథన జయహారి తిమ్మభూపాలమౌళి. 41

కం. శ్రిత జన నిధి కాతిమ్మ
క్షితితలనాథునకు ధరకు శ్రీసతి కెనయౌ
నతిచతురకు బయ్యాంబకు
వితరణ కల్పకము చెవ్వవిభుఁడుదయించెన్. 42

సీ. శ్రీశైలమందునఁ జిరతరంబుగఁ గూర్చె
ప్రాకార సోపాన పాళివెలయ
వృద్ధాచలంబున విశ్రుతంబుగ నిల్పె
ప్రాసాద మండప గ్రామ సమితి

వరుణాచలంబున నలవరించెను మించ
గోపుర సంఘర్షణా పురములు
గోపర్వతమున నెక్కుడుగాఁగ నవరించె
పూజా విశేషమపూర్వమనఁగఁ

గీ. నతుల మృష్టాన్నదాన కన్యాప్రదాన
బహు తటాక నవారామ పంక్తు లెలమి
ధరణి వెలయించెఁ దన మహోదార మహిమ
తిమ్మభూపాలు చెవ్వ ధాత్రీవిభుండు. 43

ఉ. ఆచినచెవ్వయ ప్రభున కంచితకీర్తికి మూర్తిమాంబకున్
యాచకకల్పకంబు నిఖిలావనిపాలన ధర్మమర్మ వి
ద్యాచతురాస్యుఁ డచ్యుత ధరాధిపుఁ డాత్మజుఁడై జనించెఁ దా
నాచతురార్ణవీవలయితావని భూభుజులెల్లఁ గొల్వఁగన్. 44

సీ. శ్రీరంగపతికిని సింహాసనంబునుఁ
బ్రణవమయంబగు పసిఁడిసజ్జ
యష్టమ ప్రాకార మతుల గోపురములు
రత్నాంగద కిరీట రాజమభయ
హస్తమున్ చైత్రరథారోహణోత్సవం
బారామములును మృష్టాన్నశాల
లర్చకకోటికి నగ్రహారంబులు
వివిధ నాట్యములు నైవేద్యములును

గీ. దానమర్పించి తత్సన్నిధానమందు
నతుల ముక్తా తులాపూరుషాదిదాన
వితతిఁ జేసెను జగమెల్ల వినుతిసేయ
చిన్న చెవ్వాయ యచ్యుతక్షితివరుండు. 45

సీ. ప్రాణభయంబునఁ బఱచి తల్లడమంది
భోగిరాజకులంబు పుట్టలరయ
దళముగా నొక్కట ధరణీభృత్తాళుల
శరవృష్టు లంతట జడిగొనంగ
మిఱుమిట్లు గొన దృష్టి మిడిచి మన్నీలెల్ల
బెదరి చేబారలు పెట్టుచుండ
వలగొని దీధితుల్ వరలంగ దొరలెల్ల
నురుమని పిడుగంచు నులికిపడఁగ

గీ. మెఱపు మెఱచిన చాడ్పున మేలిపసిఁడి
పక్కెరను మించు తేజిపై నెక్కియేలు
చిన్నచెవ్వాయ యచ్యుత క్షితివరుండు
సమరనిశ్శంకుఁడని జనుల్ సన్నుతింప. 46

సీ. సింగముల్ గలవని చింతఁ జెందఁగ నేల
తనుమధ్యముల కోడి తలఁకియుండ
గజములు గలవని కళవళింపఁగ నేల
కుచకుంభముల కోడి కొంకుచుండ
చమరముల్ గలవని చలన మందఁగ నేల
నెఱివేణులకు నోడి వెఱచియుండ
పాములు గలవని భయముఁ జెందఁగ నేల
రోమరాజుల కోటి రోఁజుచుండ

గీ. నద్రి కృతకాద్రికిని సాటియనుచుఁ దెలిపి
వెఱపుఁదీర్తురు తమతమ తెఱవలకును
చిన్నచెవ్వాయ యచ్యుత క్షితితలేంద్రు
విజయధాటికిఁ బాఱిన వీరవరులు. 47

కం. ఆ యచ్యుత భూభుజునకు
నాయతశుభకీర్తి మూర్తమాంబకు జితరా
ధేయుఁడు రఘునాథధరా
నాయకుఁ డుదయించె నృపతినాయకమణియై. 48

సీ. బాణయంత్రంబులు బహువిధంబులుగాఁగ
సవరించినారంచు చాలనుబ్బి
నేల యీనిన రీతి నిఖలసైన్యంబులు
ఫౌజు దీర్చెనటన్నఁ బ్రమదమంది
గంధగజంబులు గంధర్వరాజముల్
నడచెనటన్న నానందమంది
పాండ్య తుండీరేంద్ర పారసీకాధిపు
లెదురుకొన్నారన ముదముఁ జెంది

గీ. వీరలక్ష్మీ కరగ్రహ విభ్రమమున
రణము పెండ్లిగ నడచి యారాయనంగ
చెలఁగి చూపుల విందులు సేసెనౌర!
నిత్య జయహారి రఘునాథ నృపతిశౌరి. 49

సీ. పాదముల్ దొట్రిలఁ బడిన రాజన్యులు
జలమానవుల సొంపు సవదరింపఁ
బఱవఁ జాలక మ్రొగ్గిపడిన మత్తేభముల్
కుంభినీధరముల కొమరుచూప
భటుల చేవడి జాఱిపడిన ఖడ్గంబులు
బెళుకు వాలుగమీల పెరిమ నెఱప
నడవనోపక సోలిపడిన శత్రుస్త్రీలు
పవడంపు తీవెల ప్రౌఢి మెఱయ

గీ. సహ్యకన్యక జలరాశి చందమొందె
పతుల యనుస్మృతి సతులకు పాడియనఁగ
నచ్యుతేంద్రుని రఘునాథుఁ డనినిదీర్చి
యరుల పాళెంబు వెంపరలాడునపుడు. 50

సీ. ఈ పొలు సుడివడ నెంచి వ్రీలెనటంచు
కదలక యున్నట్టి ఘనతకతన
తురగముల్ గజములు త్రొక్కుత్రొక్కాడంగ
నదనని పైఁబడి నట్టివలన
చెదరెఁ బాళెమటంచు చేరి చారులుదెల్ప
విని మెల్లమెల్లనె చనెడు కృపను
మొదలి మన్నీలె పాఱెదురు చూడుఁ డఁటన్న
నంటి వెన్నాడిన యట్టిమహిమ

గీ. పాండ్య తుండీర చేరాంధ్రపతులు బ్రతికి
కాచెనని యెంచి ఘనముగాఁ గాన్కలిచ్చి
యచ్యుతేంద్రుని రఘునాథు ననుదినంబు
సేవసేయుట లోకప్రసిద్ధిగాదె. 51

సీ. ఆలానములఁ గట్టినట్టుల యుండెడు
వింధ్య సింహాళ మద ద్విరదములను
వాజిశాలలయందు వరుసగానున్నట్టి
శక సింధు బాహ్లీక సైంధవముల
కోట్లసంఖ్యలకు నెక్కుడు వెలల్ గొన్నట్టి
బహురత్న కాంచనాభరణములను
మేదిని నడయాడు మెఱుపుఁదీవెల రీతి
శృంగారవతులైన యంగనలను

గీ. విడిచిపాఱుట కాన్క గావించి రనుచుఁ
గాచి విడిచెను పాడిల గాకమున్న
నచ్యుతేంద్రుని రఘునాథు నని నెదిర్చి
జీవములతోడ తమకోట చేరఁగలరె? 52

సీ. కపురంపు తావులు ఘుమ్మనఁ బుక్కిటి
వీడెంబు లోకయింత వెలికిఁ గ్రమ్మ
సొగసుగాఁ జుట్టిన సిగబొందులను బొందు
పఱచిన యరవిరిసరులు జాఱ
నందంబుతో కొమ్ముగందంబు పట్టెలు
బిగిదప్పి యెడనెడఁ బేటు లెత్త
వలివాటువైచిన తెలిసాలు దుప్పటి
చెఱఁగులు నేలదప్పి చెదఱియుండ

గీ. నచ్యుతేంద్రుని రఘునాథు నని నెదిర్చి
పోటుగంటున నెత్తుటఁ బొరలుదొరలు
విజయలక్ష్ములు తముఁబాయు విరహమునను
చిగురుఁబాన్పునఁ బొరలెడు చెల్వు గనిరి. 53

స్ర. ఘట్టించెన్ వైరిధాత్రీధవులను రఘునాథక్షమాజాని పాళిన్
మెట్టించెన్ పాళియంబుల్ మెఱసి నరవరుల్ మెచ్చఁగా హెచ్చుధాటిన్
కట్టించెన్ సహ్యకన్యన్ కఠినరిపుశిరః కాయపాషాణ పంక్తిన్
పట్టించెన్ ధర్మదారల్ ప్రతిభటసుభట ప్రాణరక్షాపరుండై.

గీ. కృతులు మెచ్చంగఁ దగిన సత్కృతులు ధరకు
హారములనంగఁ దగు నగ్రహారములును
సకల దేవాలయ ప్రతిష్ఠలును నిఖిల
దానములుఁ జేసె రఘునాథ ధరణివిభుఁడు 55

గీ. అట్టి మహిమకు నునికిపట్టయినయట్టి
ఘనున కచ్యుత రఘునాథ మనుజపతికి
గరిమ మీఱ గళావతీ కమలనయన
రాణిఁ గనుపట్టె పట్టపురాణి యగుచు. 56

సీ. పతిభక్తి లతికలఁ బాదుకొల్పెడు పాదు
సద్గుణ గణముల జన్మభూమి
బహుళ సౌభాగ్యసంపదల కొటారంబు
ప్రాణేశు కరుణకుఁ బట్టుఁగొమ్మ
సవతులు కొనియాడు సత్కీర్తులకు తావు
పరిజనంబుల పాలి భాగ్యరాశి
యాకార శుభలేఖ లలరెడువిభుఁబట్ల
సహజ దయాపూర సారసరణి

గీ. వాణి వారిజపాణి శర్వాణి దక్ష-
నితరసతులను సవతుగా నెన్నఁదరమె
మహిమ రఘునాథ జననాథ మదనరతికిఁ
జతురమతికిఁ గళావతీసతికి నెందు. 57

పంచచామరము :—

కళావిలాసమాన్యలైన గౌళపాండ్యకన్యకల్
కళాచికా కరంక పాదుకల్ ధరించి కొల్వఁగా

కళా కళా కలాప బోధ గౌరవాతిధన్యయా
కళావతీసతీలలామఁ గాంచె భాగ్యసంపదల్. 58

చ. లలితపతివ్రతావ్రత కళావతి యైన కళావతీసతీ
కులమణియున్ మహీరమణకుంజరుఁడౌ రఘునాథమేదినీ
తల బలభేదియున్ గని రుదారుని యచ్యుతరామభద్రు దో
ర్బల జయభద్రుఁడౌ విజయరాఘవశౌరిని భాగ్యవైఖరిన్.

కం. వారలలో నగ్రజుఁ డసి
ధారాధారా ధరాంబుధారలచేతన్
వారించు వైరిభూవర
వారిజ దుర్వార గర్వవారము నెపుడున్. 60

మ. నిలుఁబెల్లం గరుణారసంబు పలుకుల్ నీతిప్రచారోన్నతుల్
తలఁపుల్ ధర్మముపుట్టినిండ్లు నడకల్ దాక్షిణ్య సంకేతముల్
కల రే? యచ్యుత రామభద్ర ధరణీకందర్పునిం బోలఁగా
నిలలో భూత భవిష్యదద్యతన భూమీశుల్ విచారించినన్.

—: కృతిభర్త విజయరాఘవ నాయకుఁడు :—

చ. అతనికి సోదరుండు భువనావనతామరసోదరుండు సం
తత నిజకీర్తిధామ సుమదామసువాసిత దిక్సువాసినీ
వితత శిరోజచూర్ణరుచి విభ్రమవిభ్రమ కృత్ప్రతాపుఁ డ
ప్రతిముఁ డజేయుఁడౌ విజయరాఘవుఁ డీ మహి నేలు మేలనన్.

సీ. పరగూఢ తంత్ర ప్రబంధార్థములు దెల్పు
వ్యాఖ్యాన మెవ్వాని వచనరచన
నిఖిల శాత్రవ భూతనిగ్రహం బొనరించు
మంత్రంబు లెవ్వాని మంత్రశక్తి

గంధాంధ పరిపంథి గంధేభముల నిల్పు
నిగళంబు లెవ్వాని మగతనంబు
ప్రత్యర్థి పార్థివ ప్రతిమల నాడించు
సూత్రంబు లెవ్వాని సూక్ష్మబుద్ధి

గీ. అతఁడు చెలువొందు విశ్వంభరాతిశాయి
విక్రమ క్రమ విద్విషద్వీరకోటి
కుంభినీధరగుంభిత కూటకోటి
కఠిన శితకోటి విజయరాఘవకిరీటి. 63

సీ. గంధసింధురములఁ గవికోటికి నొసంగ
దక్కునె యీదిశాదంతులెల్ల?
భాషాధిపతినైనఁ బ్రజ్ఞచే నదలింపఁ
దొలఁగక శేషాహి నిలువఁగలదె?
యాఖేట విహరణం బలవరించెడుపట్లఁ
దప్పునే యీ కూటదంష్ట్రి యొకటి?
ధైర్యంబు హాటకాహార్యంబు నదలింప
గులగులగాకున్నె కులధరములు?

గీ. వీటి సాహాయ్యమైన ప్రాపేటికనుచు
విజయరాఘవమేదినీ విభుని మూపు
మహి వరించెను శాశ్వత మహిమలెంచి
మేలుగలపట్ల కాంతలు మేలుపడరె? 64

సీ. ప్రబల ప్రభావ నిర్భర దీప్తిపేరిటి
నెఱసంజ యంతట నెఱయుచుండ
కీర్తనీయ సమగ్రకీర్తికందళులను
తారక లెల్లెడఁ దనరుచుండ

తురగ ఖురోద్ధూత ధూళిపాళికవేరి
గాఢాంధకారంబు గ్రమ్ముచుండ
బహువిధంబుల నేర్పు పరగంగ మెలఁగెడు
నసిలతల్ దూతిక లగుచునుండ

గీ. విజయరాఘవ మేదినీవిభు నెదుర్చు
వీరశృంగారు లైనట్టి విమతవరుల
కమర శరదిందు ముఖులకు నమరె నౌర!
జారిణీజార సంగమ సంభ్రమంబు. 65

సీ. అవతంసములమీఁది యాస నెన్నటికైన
పల్లవంబులు గోరఁగిల్లవలదు
వేనలిఁ దుఱిమెడు వేడుక నైనను
చంపకమ్ములచాయఁ జనఁగవలదు
తిలకంబు తీరుగాఁ దీర్చు కోరికనైన
జేగురుల్ గల దరుల్ చేరవలదు
కలయుసేయు ముచ్చటకై పరాకున నైన
చుఱుకుఁ గెంపుల కనుల్ చూడవలదు

గీ. విజయరాఘవవిభు మహావిభవ మిట్టి
మహిమతోనుండ మఱచియు మగువలార!
యపకృతులు సేసి యడవుల నడలఁ జేయ
వలవదను కొంద్రు మలయాద్రి వనుల రిపులు 66

సీ. కుంభినీధరముల గుహలఁ జేరెదమన్న
కొదమసింగంబులు మెదలనీవు
వారాశిలోపల వసతి సేసెదమన్న
గండుమీన్రాయిడి నుండరాదు

మడుఁగులలోపల నడఁగి యుండెదమన్న
మకర సంఘమ్ములు మనఁగ నీవు
మేరువు కవ్వల మెలఁగెద మన్నను
భానుచంద్రులు వెంటఁ బడుదు రెపుడు

గీ. నతని బిరుదంబు లెల్లెడ నాక్రమించె
నెచటి కేఁగెద మని కాన్క లిచ్చి రిపులు
విజయరాఘవ మేదినీ విభువతంసు
చరణపద్మంబులను జేరి శరణమంద్రు. 67

సీ. చిలుకపోటున తేనె జిల్లునఁ జిమ్మెడు
కమ్మని ఫలము లాఁకటికి నొసఁగి
కప్రంపు టనఁటుల కదిసిన దీర్ఘికా
జలములచే దాహశాంతిఁ జేసి
వలిగాడ్పు చిఱుతసోఁకుల చేత నసియాడు
చిగురు వీవనలచేఁ జెమట లడఁచి
కలువ రాచలువరా నెలవుల నెలకొన
నలరుఁబాన్పుల మేని యలఁతఁ దీర్చి

గీ. తరుల దరులను విమత భూవరుల దాఁచి
కాచు నేరంబువో చుట్టుగట్టు వెలిచి
విజయరాఘవ మేదినీ విభుప్రతాప
మాఁదలను దాల్చు పద్మరాగాళి పేర. 68

సీ. గాటంపు సెలయేటి కాల్వలు ప్రవహించు
నెలవు రేవుల దాఁటి మెలఁగు వెరవు
చీమ దూరఁగ రాని జీర్ణకాననముల
సంధిత్రోవలు గట్టి జరుగు వెరవు

చక్కఁజూడఁగ రాని శైలశృంగంబుల
పడఁతులవెంబడిఁ బ్రాకు వెరవు
కంపకోట ఘటించు కరణిఁ జుట్టుకయున్న
యీరంపు వెడసందు లేఁగు వెరవు

గీ. మృగయ మును జూపి రక్షించె మీఁదెఱింగి
కాకయుండిన నచట చీకాకుపడమె
యనుచు నను కొంద్రు సతులతో నద్రివనుల
విజయరాఘవ మేదినీ విభుని రిపులు. 69

సీ. పర రాజధానుల బయలు గావించెను
వాహ్యాళి సవరించు వాహములకు
వైరిరాజన్యుల వనదుర్గముల నెల్లఁ
గడికొమ్ము గావించె కరటిఘటకు
చతురంబుధిపరీత జగతిఁ బాళెము చేసె
కని కొల్చు రిపు మహీకాంతలకును
శత్రుభూనాథుల శలభముల్ గావించె
దారుణ బాహా ప్రతాప శిఖికి

గీ. జన్య శరణాగతారి రాజన్యకులము
సంచరిష్ణు జయస్తంభ సమితిఁ జేసె
విజయరాఘవ మేదినీ విభుకిరీటి
యతిశయం బెన్న శేషాహికైన నఁదరమె? 70

సీ. ఒకనాఁట నైదాఱు యోజనమ్ములమేర
దాడిగాఁ జనివచ్చు దండితనము
నొక తేజిపైనుండి యొక్క తేజికిని వేగ
లంఘించునటువంటి లాఘవంబు

మావంతు కాల్మోరి మదహస్తి హస్తిన
నదలించి యెదిరించు నవఘుళంబు
కదిసి సానాకత్తి గదిమి యెంతటివాని
మర్మముల్ తాకించు మగతనంబు

గీ. చూడ మెందును శక సింధు శూరసేన
పాండ్య తుండీర కేరళ ప్రభులయందు
ననుచు దొరలెల్లఁ గొనియాడ ననుచువేడ్క
విజయరాఘవమేదినీవిభుఁడు వెలయు. 71

—: సాహిత్యరాయపెండేరవర్ణన :—

సీ. నిర్యత్క వైడూర్య నిర్యత్నరళనూత్న
పుంజంబు చామర స్ఫురణ చూప
పద్మరాగోన్మిష ద్భాలాతపంబులు
వలిపె చెంగావి పావడలు సేఁయ
వలయిత మౌక్తిక వలమాన రుచి సొంపు
జగజంపు గోడల సవదరింప
విశ్రుత సింహళ ద్వీప నీలచ్ఛాయ
సాంబ్రాణి ధూపంబు సంఘటింప

గీ. వినత రాజన్య కోటీర వివిధ రత్న
సమితి యీ రీతి నుపచార సరణిఁగూర్ప
విజయరాఘవమేదినీ విభుని యంఘ్రి
సౌర! సాహిత్యరాయపెండార మమరు. 72

సీ. మూర్ధ ముహుముహుర్మకుళితాంజలిపుట
మూర్ధాభిషిక్త సమూహ మలర
కట కటాహతటాంత గళిత దాన సుగంధి
గంధాంధ సింధుర ఘటలు చెలఁగ
గంధవాహన గంధగతి విశేషోన్మేష
రాజదాజానేయరాజి దనర
పరవీర సప్తాంగ హరణ వేళావాప్త
బిరుద సంఘమ్ములు మురువు మించ

గీ. తనదు మణులందు ప్రతిబింబ దంభమునను
నిండు గొలువుండు వైఖరి నెగడుచుండ
విజయరాఘవ మేదినీవిభునియంఘ్రి
సారె! సాహిత్యరాయపెండార మమరు. 73

సీ. ఫణిరాజ బహుముఖ ఫణిత బాణితముల
మర్మంబు లాత్మీయమహిమఁబొగడ
తర్క కర్కశ వాగ్వితర్క ప్రభావంబు
నిజశక్తియుక్తి వర్ణింపుచుండ
నవ్య కావ్య విశేషనాటితోన్మేషంబు
స్వాక వైభవంబుల సన్నుతింప
లక్షితాలంకార లక్షణ స్ఫురణంబు
లాత్మచాతుర్య ధుర్యత నుతింప

గీ. మధుర మధురస శింజిత మంజిమములఁ
దత్తదుచితోపచారముల్ తానొనర్చి
విజయరాఘవ మేదినీవిభుని యంఘ్రి
సారె! సాహిత్యరాయపెండార మమరు. 74

సీ. మానగ్రహాగ్రస్త మహిపాలపాళికి
మంత్రవాదంబుల మహిమమనఁగ
సత్యాహిత ప్రాప్తి సత్యాదర నృపాల
పంక్తికి సభయ సంభాషలనఁగ
నిజనాదగుణ యాథార్థ నిరుపమఖ్యాతికి
బిరుద వాదమ్ముల పెరిమమనఁగ
సకల విద్యామర్మ సందేహసరణికి
సిద్ధాంత వాక్యప్రసిద్ధి యనఁగ

గీ. తనరు నాత్మ చిరత్నరత్న ప్రకర్ష
జాత నాద ప్రకర్షంబుచేత మించి
విజయరాఘవ మేదినీవిభుని యంఘ్రి
నౌర! సాహిత్యరాయపెండార మమరు. 75

సీ. మగరాల నిగరాల మొగపుల నిగనిగ
లభిషేకజలముల హావణుఁగాఁగ
సందంద యందమౌ కుందనంపు మెఱుంగు
రంగైన కనకాంబరంబుగాఁగ
గుంపుకా నలజాతి గుజరాతి కెంపుల
విడి కుంకుమపుఁబూఁత విధముగాఁగ
బవిరిగాఁ జెక్కిన బటువు ముత్తెపు డాలు
బొండుమల్లియ గుండు దండ గాఁగ

గీ. నలరఁ గైసేసి యఖిల విద్యానవద్య
సింహపీఠంబు నెక్కిన చెలువుమీఱ
విజయరాఘవ మేదినీవిభుని యంఘ్రి
నౌర! సాహిత్యరాయపెండారమమరు. 76

సీ. చేరికొల్చినఁ గల్గు తార హారావళు
లను మాట నిజమె పాండ్యక్షితీంద్ర!
కని కొల్చినను గల్గు కనకకోటీరంబు
లనుమాట నిజమె మద్రాధినాథ!
భక్తిఁగొల్చిన గల్గు బాహుకేయూరంబు
లనుమాట నిజమె కొంగావనీశ!
నమ్మిఁగొల్చినఁ గల్గు నవరత్నకంబుల
ననుమాట నిజమె యాంధ్రాధినాథ!

గీ. అనుచు మును మంత్రు లనుమాట లనువదింతు
రనుదినంబును శింజిత వ్యాజమునను
విజయరాఘవ మేదినీవిభుని యంఘ్రి
గండపెండెంపు బొమ్మలై యుండుదొరలు. 77

సీ. అందె సింగారించ నందిచ్చు నెపమున
ధవునిఁ గన్గొనియె మాళవవధూటి
కీలుపొందిక సేసి కీలించు నెపమున
భర్తఁగన్గొనియె నేపాలబాల
పాద పీఠము నిల్పు పని నెపంబునఁ జేరి
మగనిఁగన్గొనియెను మగధకాంత
చరణాంబురుహ సేవ సవరించు నెపమున
విభుని గన్గొనియె సౌవీరతరుణి

గీ. ఇట్లుకనుగొని యరికాంత లెలమిఁ జెంది
విజయరాఘవ మేదినీవిభుని యంఘ్రి
బిరుదుపెండెంపు బొమ్మకా ప్రియులఁగాంచి
వగతు రాత్మల నిట్టూర్పు నిగుడనీక. 78

సీ. శాలివాహన శకసంవత్సరములు వే
యేనూరు నేఁబది యేను వరుస
చనఁగ శ్రీముఖ నామసంవత్సరంబున
శ్రావణ శుద్ధ పక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణద్వార
కను కృష్ణతీర్థమందు నియమమున
స్నానంబు గావించి సంకల్పపూర్వకము
గానుషోడశ మహాదానములను

గీ. ఘనత మీఱఁగళావతీ గర్భశుక్తి
మౌక్తికఫలంబు రఘునాథమహిపసుతుఁడు
విజయరాఘవ మేదినీవిభుఁ డొసంగె
వేదవేదాంత విదులైన విప్రులకును. 79

సీ. కాశికాపట్టణ ఘంటాపథంబుల
విప్రకోటులవల్ల వినుతిఁగాంచి
రామేశ్వరస్థల రాజమార్గంబుల
బ్రహ్మ సంఘములెన్నఁ బ్రఖ్యాతికెక్కి
ద్వారకాయత పురద్వార సీమలయందు
మహిసురల్ నుతియించ రహి వహించి
మధురాపురోత్తమ మధ్యవీథులయందు
వసుధామరస్తుతి నన్నెమీఱి

గీ. యలరు నీయన యనివారితాన్నదాన
మహిమ భూత భవిద్భావి మహిమహేంద్ర
ముఖుల కరుదని పొగడ దిఙ్ముఖములందు
ఘనతఁ జెలువొందు విజయరాఘవవిభుండు, 80

షష్ఠ్యంతములు.

కం. ఏవంవిధ గుణ సౌరభ
భావిత దిగ్యువతి చికురబంధున కతిసం
భావిత బుధ బంధునకా
ప్లావిత మధుర ప్రబంధ పదబంధునకున్. 81

కం. గంధాంధ విమత సింధుర
గంధప్రతి బంధ ఘర్మఘున తేజునకున్
బంధురతరామరాంధో
బంధురసాధిక్యవాక్య పదభోజునకున్. 82

కం. కుంభీనసరాట్కౌశల
కుంభీలక వాగ్విహార కోవిదమణికిన్
గుంభిత మదజృంభణ రిపు
కుంభీంద్ర స్తంభి శౌర్య గుణమతి సృణికిన్. 83

కం. ధాటీ బహుధాటీ కన
ఘోటీ కోటీ కఠోర ఖురకుద్దాలో
త్పాటితరిపువక్షునకున్
హాటకగిరిధైర్యధుర్య హార్యక్షునకున్. 84

కం. పక్షాంత చంద్ర వదనా
లక్షిత రతిపతికి సుకృత లలితాకృతికిన్
దక్షిణ భుజ భుజగేశ్వర
రక్షిత ధరణికిని విజయరాఘవ మణికిన్. 85

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబునకుఁ గ థా క్ర మం బెట్టిదనిన :— 86

## క థా ర ం భ ము

కం. నారాయణ దివ్యకథా
పారాయణతత్పరుండు పరతత్త్వకళా
పారీణుఁడు శౌనకముని
సారవిచారునకు సూతసంయమి కనియెన్. 87

సీ. హరికథాసుధలాని యానంద మందితి
నాదేవు వసతిచే నతిశయించు
దక్షిణద్వారకాస్థలమహత్త్వంబిఁక
వినిపింపు వీనులవిందుగాఁగ
ననవుఁడు, సూతుఁడిట్లను "శౌనకమునీంద్ర!
భక్తితో మున్న గోప్రళయమాని
తపము చంపకవనాంతరమున సవరింప
హరి సుప్రసన్నుఁడై యతఁడు వేఁడఁ

గీ. ప్రేమ పదియాఱువేలగోపికలు గొలువ
గరిత లెనమండ్రు ననురాగగరిమఁ జెలఁగ
వివిధశృంగారరచనలు వెలయ నందు
మహిమతో నుండు మన్మథమన్మథుండు. 88

చ. నెలకొను మించులో? మెలఁగ నేర్చిన రత్నపుఁగీలుబొమ్మలో?
కులుకులుమీఱు మారుసెలగోలలొ? పల్కెడుపూవుదీవెలో?
పొలపులు గన్నవెన్నెలలసోగలొ? నాఁ గనుకన్న ప్రాయపుం
జిలుకలకొల్కులెల్ల తన చెంతలరా నెఱరాజసంబునన్. 89

శా. కేళాకూళులచెంత, పుష్పితవనక్రీడానికుంజంబులన్
కేళీసౌధ శిరోగృహాగ్రములచక్కిన్, పూర్ణపూగావళీ

పాళీవాసిత సాంద్రచంద్రకదళీ ప్రాంతేందుకాంతస్థలిన్
లీలా నిర్జిత మన్మథుం డతఁడు హాళిం బెక్కు చందంబులన్.

గీ. తమకమున నింతులెల్లను తమకతమకె
వలచెనని యెంచ నానందవార్ధిఁ దేల్చి
యష్టవిధనాయికలలీల లలరఁగోరి
యష్టమహిషుల నలజాడ కనువుపఱచె. 91

—: స్వీయ రుక్మిణి :—

సీ. మలయానిలమ్ములు మలయ ఘుమ్మన గమ్ము
తావుల మావుల తావులందు,
పరిణత ఫలగుచ్ఛ పరిరక్షితంబులై
పఱపైన ద్రాక్షచప్పరమునందు
మగరాల నిగరాల మగఁటిమి గనుపించు
సరసిజాకర తీర సరణులందు
పొదలెడు గొజ్జంగి పొదరిండ్ల పజ్జల
చలువరేరాచచలువలందు

గీ. నొకరి కొకరికిఁ దెలియక యుండునట్లు
చతురలైనట్టి యుల జలజాతముఖులు
సఖులతోఁ గూడి సరస ప్రసంగలీలఁ
గోరికలు నిండఁ దన రాక గోరుచుండ. 92

ఉ. ఒక్కొక దూతి తోడ వినయోక్తులఁ గార్యముకూడునట్లుగా
నొక్కొకదూతితోడ సరసోక్తులఁ గోపముఁ దీఱునట్లుగా
నొక్కొకదూతి తోడ మధురోక్తుల మర్మము మీఱునట్లుగా
మక్కువ తోడ నా యువతి మన్మథ మన్మథుఁ డన్నిరీతులన్.

గీ. వరుసఁ దనరాక రాకేందువదనలకునుఁ
తెలుప నియమించి యొండొరుల్ దెలియకుండ
దూతికల నెల్ల బహుమతితోడ నపుడు
పంచె పంచేషు లీలా ప్రపంచరతుఁడు. 94

ఉ. నేరములెన్ని మున్ను రమణీమణి రుక్మిణి యెంత వేఁడినన్
దీఱని కిన్క తోడ నొకతీరున నున్నదటంచు నెంచి తా
మేరలు దప్పకుండ చెలి మేడకు నీరజనాభుఁ డేఁగి యా
చేరువ పొంచియుండ సరసీరుహలోచన యొంటిపాటునన్. 95

సీ. పచ్చఱా రాచిల్క పనికోళ్ల శిరముల
పైఁ బాదుకొన్నట్టి బటువు కెంపు
చెక్కడంబులడంబు చికిలి కంబంబుల
తుద నూకు బోదెలం గదిసియున్న
లోవదం డెమ్ముల లో మలుచుట్టుఁగాఁ
బెనఁగొని మీఁదికిఁ గొనలుసాగి
విప్పుగా చందువచప్పరంబులయందు
హరువులు మీఱఁగ నల్లికొన్న

గీ. జాళువా కుందనపుఁ దీవెచాలు పూచి
కలయ వాల్చిన యకరులగమి యనంగ
పఱపు గల కుంకుమపుఁబూవు పఱపుఁ దనర
చవికటాకున మించు మంచముననుండి, 96

శా. ఏలా? కొండెము వింటి, ప్రాణవిభుతో నేలా చలంబూనితిన్?
వేళల్గా వలుగంగ నంచుఁ జెలియల్ వేమారు చాటింపఁగా
నేలా నే విననైతి? నిట్టివెతచే నేలాగు వేగింతు? నిం
కేలీలన్ విభు వేఁడుదాన నని యెంతే వంతఁ జింతింపుచున్,

గీ. చెలులు గనకుండ నేర్పున చెలువవిభునిఁ
జిత్రపటమునఁ గస్తూరిచేత వ్రాసి
గబ్బిగుబ్బల తుదలు సోఁకంగఁ జేర్చి
పలికె నిట్లని తన యభిప్రాయమెల్ల. 98

మ. 'కలలోనైనను నీదు మాటలకు నౌఁగాదంచు మాఱాడుటల్
గలవో? వాడల వాడలం దిరిగి రాఁగా నీకు మెండొడ్డుటల్
గలవో? చూచిన వార లందఱు నగంగా నిన్ను విన్నాణముల్
గలవో? మానవతీవిలాసమకరాంకా! యింక నేమందురా?

చ. గటిగటి నంట తుంటవిలుకాని శరంబులు నా యురంబునన్
జుఱజుఱగాడ నీవు దయఁజూడక యుండుటలిప్పు డక్కటా!
చెఱకునఁ బండు పండిన భుజింపఁ దలంపమి గాక ప్రాయపుం
దెఱవలతోడ నిన్ను తరితీపులు చేసినవారిఁ గంటిమే? 100

చ. వలఁగొను చింత తోడ నెలవంకఁ గనుంగొని యేఁ దలంకఁగాఁ
గలఁగకు మంచు మున్న బిగిఁగౌఁగిటఁ జేర్చుదు విప్పుడక్కటా!
కులుకు మెఱుంగుగబ్బి వలిగుబ్బలపై నెలవంక లుంచి యేఁ
దలఁకుచు నుండ నీవు దయఁదప్పిన నేగతిఁ దాళనేర్తురా? 101

సీ. ఏలాగు విహరింతు లీలాసరః ప్రాంత
కాంత నిశాకాంతకాంత సరణి?
నేలాగు సైరింతు నేలాతిసౌరభ
భ్రమజాతి విభ్రమ భ్రమరగీతి?
నేలాగు వసియింతు నీలాశ్మకృతవేశ్మ
జాల శీతల మరుజ్జాలకముల?
నేలాగు చెవిఁజేర్తు లోలాభ్రమదళి వలత్
కలకంఠ కులకంఠ కలరవంబు?

గీ. నెటులఁ గనుఁ గొందునకట! పూర్ణేందుబింబ
సౌధరసపూర సరిధౌత సౌధయూథ
టంక ముఖక్లృప్త చిత్రవిటంక నీడ
చంచ చాంచల్యవచ్ఛలచ్ఛంచువిహృతి. 102

మ. కులుకుంజన్నులమీఁది హారములు చిక్కుల్ దీర్చు నందంబునన్
గిలిగింతల్ గొన వాఁడి గోరుమొనలన్ గీలించి లాలించి పై
వలపుల్ జేఁచి మనంబులం గరఁచి చేవల్ మీట లోనైనయా
తలిరుంబోఁడులపట్ల నిన్ని వలవంతల్ చెల్లునా? వల్లభా! 103

చ. చెలువుఁడ! నీవు నాఁడచట చెక్కులపై కొనగోరఁ గస్తురిన్
వలపున మన్మథాంకములు వ్రాయుచు నేర్పున నాటనూఁదినన్
చెలులు కనుంగొనంగ జడచే నిను కొట్టిన యిట్టినేరముల్
తలఁపున నిల్పి నీవు దయఁదప్పిన నిప్పుడు తాళనేర్తునే? 104

శా. నేరం జేనె యొనర్చి మాచెలియతో నేర్పుల్ పచారింపఁగా
నేరా నీకని యెచ్చులున్ వలుక నేమీ నేరమై తోచునో?
రా రమ్మంచును ప్రేమతోడ ననుఁ జేరంబిల్చి లాలించ వీ
వేరా? రాజశశాంక! యింక నడురే యేలాగు వేగింతురా?

సీ. తలఁచవైతివి గదా? కలధౌత మయసౌధ
కలిత మన్మథకథాకథనుసరణ
లెన్నవైతివి గదా? సన్నుత పున్నాగ
పారావతారావ పరిచయములు
చూడవైతివి గదా? క్రీడాగృహక్రీడ
గూఢ గాఢ నవోప గూహనములు
తెలియవైతివి గదా? దృఢమాన మానస
ప్రమదార్థ శపథ సంభాషణములు

గీ. కొదనునెల నెలవంకల కొదలుదీర్చు
నభినవ నఖాంకములు గుబ్బలందు వెలయఁ
బ్రణయబంధంబు వేఱైన పట్ల నిపుడు
మఱచుటే వింత తొల్లింటి మమతలెల్ల. 106

మ. చనవుల్ మీఱఁగ మాటలాడుటలు బాసల్ చేసి నమ్మించుటల్
వినయంబుల్ ప్రణయానుబంధములు నీవే వేఱఁగావింపఁగా
నిను నేఁ గోపముతోడ నేమనిన దానింబట్టి పాలార్తురా?
వనితామన్మథ! నేర్పు నేరములు లేవా? చూడ నెవ్వారికిన్! 107

మ. అలుకల్ దీఱిచి ముద్దువెట్టుకొని సయ్యాటంబునన్ శయ్యపై
కలపారావతకంఠనాళరవముల్ గల్పించి మెప్పించి నన్
పులకల్ జాదుకొనంగ నేలుకొను నేర్పుల్ సాక్షి నీయోర్పులున్
లలనామోహనపంచబాణ! యిఁక నేలా? చాలు సిగ్గయ్యెడిన్.

సీ. గుబ్బలపై వాఁడి కొన గోరులుంచరా!
నెలవంక బింకంబు నిలుచుగాని
చక్కెర కెమ్మోవి చవిచూడ నీయరా!
చిగురు గుంపుల సొంపు చెదఱుగాని
జెళుకు కెందళుకు చూపులచేత చూడరా!
కలువరేకుల ఢాక కదలుగాని
వలి తేనెతేటలు చిలుక మాటాడరా!
చిలుకల గరువంబు చిటులుగాని

గీ. ఎన్నిపలికితి నవి మది మెన్ని నీవు
దీనమందార! నన్ను నధీనఁ జేసి

మూరు నదలించి యేలు వేమూరు దయను
రాజవదనలతోడనా రాజసములు? 109

ఉ. వాటములైన బంగరుకవాటములం గలయట్టి యందముల్
నీటున మీటు నీయురము నిండఁగ గుబ్బల నాని పల్మొనల్
నాటఁగ నొక్కి చొక్కి జతనంబుగ వాతెరతేనె యానకే
మాటలఁదీరునా, యువతిమన్మథ? మన్మథతాపవేదనల్?' 110

గీ. అనుచు నాథుని వేఁడుచున్నట్టివేళ
వనితచందంబుఁ దెలియంగ వచ్చినట్టి
యనుఁగునెచ్చెలి నెమ్మది హర్షమంద
మందహాసంబు తోడనమ్మగువ కనియె. 111

చ. పలికిన మాఱుపల్కనని పంతములాడితి వింతమాత్రమా!
నిలిచిన వానిచెంతలనె నిల్వనటంటివె యొంటిపాటునం
గలికిరో! నేఁడు చిత్రఫలకంబున నాభువనైకమోహనున్
బొలపున వ్రాసి వేఁడికొనఁ జూచినఁ జూచినవారు నవ్వరే!112

చ. అన విని మానినీతిలకమప్పుడు నెచ్చెలితోడ నిట్లనున్
"వినుము లతాంగి! యేఁ గొలుచు వేలుపు వేఁడితిగాని నెమ్మదిం
గినుక దొలంగ వల్లభునిఁ గీర్తనసేయఁగ నీవు వింటివా?"
యను సమయంబునందు దరహాసము మోమున నంకురింపఁగన్

గీ. మోహనాకార రేఖల మూరువుగన్న
యాత్మవిభుఁ డంత తనచెంత కరుగుదేఱ
నవనతాననయై యున్న యువతిఁ జూచి
హేతుగర్భంబుగాఁ జెలి యిట్టులనియె. 114

చ. వలపులవింటివాని చెలువంబున గెల్చినయట్టివేలుపుం
గలికిరో! నేఁడు చిత్రఫలకంబున నేర్పున వ్రాసి యొంటిగాఁ
బలుమరు వేఁడుచున్న నటభాగ్యవశంబున సుప్రసన్నుఁడై
నిలిచెను వాఁడు నీయెదుట నేఁడు ఫలించెను గోర్కె
లన్నియున్. 115

క. అని యొకపని నెపమున న
య్యనుఁగుంజెలి యవలి కేఁగ నవనతముఖియా
వనజాననఁ గనుఁగొని విభుఁ
డనునయపరుఁ డగుచుఁ బలికె నాదరమొప్పన్. 116

శా. 'నీలేందీవర దామధామముల సందేహంబు గల్పించు నీ
లీలాలోలకనీనికల్ సొలపు హాళిం జూప నన్ జూడవే?
ఏలేకోపము? లేటికేచలము? లింకేలేవృథామానముల్
లోలాక్షీ! పులకండముల్ గులుకుపల్కుల్ వల్కు లాలింపవే!

సీ. కాంత! నీనిడువాలు కలికి చూపులుగాక
కలువలు తాపంబు నిలుపఁగలవె!
కొమ్మ! నీవలి గబ్బిగుబ్బచన్నులుగాక
యలరుగుత్తులు కాఁకనాఁచఁగలవె?
చిలుకలకొలికి! నీచిఱుత నవ్వులుగాక
రేయెండశిఖల వారింపఁగలవె?
ముద్దియ! నీతేటముట్టు నెమ్మోము గా
కంబుజంబులు వేఁడి నడపఁగలవె!

గీ. అంగనామణి! నీమోహనాంగములకు
నెన్న వీటికి నంతరం బెంతయనక
పోల్చి విరహాగ్ని వీటిచేఁ బోవుననెడు
నేరమెన్నక నన్ను మన్నింపవలయు. 118

చ. సొలసిన నీవిలాసములఁ జొక్కిన వేళలఁబల్కరించి యేఁ
బలుకక యున్న వేళలను నీపై మనసా యని యల్గి నీవె యేఁ
గలిగినఁజూచి యంతబిగికౌఁగిటఁ జేర్పుదు విప్పఁడక్కటా!
కలికిమిటారి! ఏమిటికిఁగా వలరాయని కప్పగించెదే?' 119

గీ. అనుచు మాధవుఁ డీరీతి యనునయింప
కోపసంతోషములు పెనఁగొనఁగఁజూచు
సొలపుఁజూపుల జాడలఁజూచి వేడ్క
కౌఁగిటనుజేర్చి రుక్మిణీకాంత నంత. 120

సీ. కురులు నున్నఁగ దువ్వి విరులు పైగానరా
కుండ వంకఁగ గాసెకొప్పువెట్టి
చెమటపావడ నొత్తి చెక్కునఁ గుంకుమ
బాగుగా వలరాచపడగవ్రాసి
మెలిగొన్న హారముల్ మెల్లఁగ విడిపించి
కులుకుగుబ్బల మీఁదకుదురుకొల్పి
చెదరినతిలకంబు చిటులఁగ సారంగ
నాభిచే గోనఁగోర నాభిఁదీర్చి

గీ. కలయ నెమ్మేననేర్పున గడమలందు
నందచందంబులను గళలంటి కరఁచి
యంగనామణి హృదయంబునందు నపుడు
పాదుకొను కోపమును 'లేదు బంతి' యనియె. 121

క. కలగలుపు వలపు మక్కువ
జిలిబిలి కందువుల మాట చిఱుసోఁకులచేఁ
జెలిగరఁచె కాంతుఁడవియే
మలయజగంధికిని వశ్యమంత్రములయ్యెన్. 122

ఉ. చెక్కునఁజెక్కుఁ జేర్చుచును ఁన్ని మెఱుంగుల మోవి పల్కునన్
నొక్కుచుఁ జొక్కుచున్ వలపునాల్కన నుల్లము పల్లవింపఁగా
కక్కసపుంబిసాళి వలి గబ్బిమిటారపు కోడెగుబ్బలం
జిక్కఁ గవుంగలించి మదిఁ జెందిన రాగము పెంపుసొంపునన్.

గీ. గరఁగి కరఁగించి మిగుల వక్కరలుమీఱ
కఱగొఱలు లేని చెయ్వులనాదరించి
మోహనాకారుఁ డాజగన్మోహనాంగి
కాంక్షితంబుల సఫలముల్ గానొనర్చె. 124

చ. అలఁతలు చూపు చూపుల యొయారములున్ వడఁదేఱు మోములున్
మొలచిన ఘర్మవారికణముల్ బిగిఁదప్పిన చిత్రకంబులున్
పలచనయైన మేని కలపంబులు వేఱొకపొల్పుఁ దెల్పఁగా
నలరెను వారియందు సురతాంతవిలాస విశేషవైఖరుల్. 125

ఆశ్వాసాంతము

శా. భద్రశ్రీహరిణాది కారణయశః పంచాస్య! పంచాస్యజి
ద్రౌద్రశ్రీ నతరక్షకత్వ కృతిసంధాటీక! ధాటీకథా
భద్రాత్మీయ భుజార్జితారిరమణీ పాంచాల! పాంచాలభూ
మద్రక్షోణి కరూశదేశముఖ సీమాధార మాధారకా! 126

కం. మదనాగలసిత సదనా!
సదనాంతరబోధనైక చతురిమవదనా!
వదనారద నుతకదనా!
కదనాదర రహితహృదయ! కాంతా మదనా! 127

పం. కతారికాహతాపతత్రిపగల్భతా శతారిరా
ట్కఠోర కంఠలుంఠనాలుఠత్ సముత్కటప్రయు
క్కతారికాకఠోర చంద్రకోణనామ భాగ్యభా
క్పితాపుతాగడావజీరబృంద బృందవందితా! 128

క. భావానుభావ భావిత
భావజ!జాత్యశ్వ కలితబహు విధధాటీ
దావనవల్గన వేష్టన
రేవంతక! 'ముద్దుచంద్రరేఖా' కాంతా! 129

గద్య. ఇతి శ్రీమత్కామాక్షీశ్వర కరుణాకటాక్షలబ్ధసిద్ధ సార స్వతనయ, చెంగల్వ వెంకటార్యతనయ, విజయరాఘవ భూప్రసాదాసాదిత వివిధరాజచిహ్నచిహ్నిత భాగధేయ, కాళయనామధేయ ప్రణీతంబైన రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 130



శ్రీరస్తు.

# శ్రీ రాజగోపాల విలాసము

## ద్వితీయాశ్వాసము.

శ్రీరాజగోప కరుణా
పూరాపూరిత సమస్తపురుషార్థనిధీ!
వారణఘోటకహాటక
రారాజత్సదన! విజయరాఘవమదనా! 1

గీ. అవధరింపుము సూతసంయమివరుండు
శౌనకునితోడ నిట్లను శౌరి యట్లు
భోజతనయను సమ్మదాంభోధిఁ దేల్చి
తక్కినటువంటి సతులపైఁ దలఁపు నిల్పి. 2

—: జారిణీభద్ర :—

సీ. పలకవజ్రపు తేట తెలి నీటిచిట్టాట
చలువల గుబురుగా మొలచి హెచ్చు
పచ్చరాతీవెలపై లేట తుదలనుఁ
జిగురించు కెంపురా చిగురుగుంపు
సందుసందులయందుఁ గందళించినయట్టి
కట్టాణిముత్యాల కమ్మవిరుల
వైడూర్యముల తెర వలిదేనియకు మూఁగు
కప్పురా తేంట్ల ఝుంకారసరణి

గీ. కరణిఁదనరారు గాయనీగానతాన
మానమానితనవసుధా మధురిమముల
జీవబంధంబు గన్న విచిత్రచిత్ర
రాజి రాజిలు నొక సౌధరాజమందు 3

మ. తళుకున్నిద్దపుఁ దారవజ్రములచేతన్ మించు పైయంచులన్
వలగోఁ జెక్కిన కెంపురాపలకమిన్నల్ జాజుపట్టెల్ వలెన్
వెలయంగా వెలలేని రత్నముల నెంతే వింతయౌ తిన్నెపై
కలకంఠీమణి దూతిరాక మది నాకాంక్షించి కూర్చుండఁగన్.

గీ. ఎల్లగరితలు తన జాడ లెఱుఁగకుండ
జారభావంబు మదిఁగోరు శౌరికడకు
భద్రచెంతకు నంపిన ప్రౌఢదూతి
నెమ్మిమీఱంగ వచ్చి వినీతితోడ. 5

మ. తొగరారాతెగ మేడయోవరుల జోతుల్ తేటనిద్దంపులేఁ
జిగురున్వెన్నెలచల్వచప్పరమునన్ చిన్నారి పూగుత్తులన్
నెగడం జేయఁగ బాటనుండి వలిదేనెల్ చిందు చందంబునన్
చిగురుంబోడి మురారిఁ జేరి పలికెన్ జిత్తంబురా నత్తఱిన్ 6

గీ. స్వామి! యెంచిన కార్యంబు సఫలమయ్యె
నెచట సంకేతమో యానతీయవలయు
ననుచుఁ బలికిన శౌరియు ననుచువేడ్క
నల శుకాలాపతోడ నిట్లనియె నపుడు. 7

చ. కలికిరో! నీవు వచ్చుదనకన్ సురపొన్నలపజ్జ గొజ్జగుల్
వలగొను తేటమంచు తెలివాఁకలచెంతల మావిమోకలన్
మలకలుగాఁగ నల్లికొను మాధవికాలతికల్ మరందముల్
చిలికెడు పువ్వుచప్పరము చెంగటి యాపొదరింట నుండెదన్.

క. అని గుఱుతుగ సంకేతము
వనజాక్షికిఁ దెలిపి పోయివచ్చెదవా? నీ
వని యనిచిన నవ్వనితయుఁ
జనియెం జెలియున్న కేళిసౌధము కడకున్. 9

చ. చని యలదూతి యవ్వికచసారసలోచనఁ గాంచి యచ్చటన్
వనజ మృణాళ చంద్ర హిమవారి పటీర లతాంత సంతతుల్
గొని యుడికంపుఁజేడియలు గొందఱు సందడి సేయు
చుండఁగా
నెనరునఁ జేరనేఁగి మది నెయ్యము తియ్యము దోఁప నిట్లనున్

మ. 'లలనా! చక్కెరవెట్టవే' యనుచు చిల్కల్ సారెకుం బల్కఁగా
నలరుల్ క్రుమ్మిడిఁ జేర్పుమంచుఁ జెలు లంతంతన్ నిను
న్వేఁడఁగా
జలకంబన్నను భోజనంబనిన వేసారంగ నేకార్యమో
తలుకన్ జవ్వని! నన్నువంటిచెలి నీకుంగల్గ నింకేటికిన్? 11

చ. వెలఁదుల నాతఁడేలు మరి వేలకొలందుల వారిలోన నన్
దలఁపున నిల్పునా యని వితాపిత యీవెతఁ జింతసేయఁగా
వలవదు: నీపయిన్ వలపువాఁడని నమ్మికపుట్ట గట్టిగాఁ
బలికెదనమ్మ యీ కనకపంజరకీరము సాక్షిగాఁజెలీ! 12

క. సమయోచిత శృంగారము
సముచితముగఁ బూనవమ్మ! సారసముఖి! నీ
రమణుఁడు నాతోఁజెప్పిన
సమయస్థలిఁ జేర నిపుడె చనవలయుఁజుమీ! 13

సీ. కొలమునామములటంచుఁ గూడిరాకుండను
బాదాంగదమ్ములఁ బరిహరింపు
మొగిలిమొత్తమటంచు మూఁకసేయకయుండ
గీలుగంటునఁజేర్పు మేలిముసుంగు

వెలఁదివెన్నెలయంచు వెంటరాకుండను
 తళుకుఁగన్నులఁ జూపు బెళకనీకు
మనుఁగుఁజుట్టమటంచు నంటి రాకుండను
 చన్నులఁ బయ్యెద జాఱనీకు

గీ. మనుచు గై సేసి నవచంద్రికాధ్వముగను
హంసకేకీ చకోర రథాంగకులము
లనుసరింపక యుండ నుద్యానమునకు
నెలఁతఁ దోడ్కొని వచ్చెను నేర్పుమీఱ. 14

గీ. అంతఁ బతియును నచట నక్కాంతనంత
నెపుడు చూచెద ననువేడ్క లిగురులొత్త
నల వసంతుని నగరికి నలరువిలుతుఁ
డేఁగు విధమున వనివీధి కేఁగఁదలఁచి. 15

గీ. జాఱుసిగఁ బూపుటెత్తులు చక్కఁజెరివి
దండ వేదండగమన కైదండయొసఁగ
తరుణి యొక్కఁతె పాదావధాన యనఁగ
డిగ్గునను లేచి గద్దియ డిగ్గి యపుడు. 16

సీ. పరవంజికెలఁకులఁ బంజకీరమ్ము
 లెచ్చరించినఁ జూచి వెచ్చనూర్చు
నెమ్మిబోదలు చెంత నెమ్మిలాస్యముఁజూప
 వెగడుపాటున మారుమొగము వెట్టు
మణిజాలకమ్ముల మలయంపువలిగాడ్పు
 సొలయుమార్గంబులు తొలఁగి యేఁగు
సిగజాఱునరవిరి చెంగల్వ మొగడల
 ఫలగొను తేంట్లకు కలఁగి నిలుచు

గీ. నిలిచి, మదిలోన నేమేమొ తలఁచు, తలఁచి,
యొచట కేఁగెద నిపుడని యెంచు, నెంచి
బలిమిఁ దనుఁదానె యొకకొంత తెలియుఁ దెలిసి
చింతతోడుత నెలఁదోఁట చేరి యందు. 17

చ. మలయాతటీ పటీరతరు మాంసలసౌరభ భార మందసం
చలన సమీరలోల జలజాత సుజాత పరాగరాగ సం
కలిత మనోహరాస్తరణకాంత నిశాకరకాంత వేదికా
తలముననుండి యవ్వికచతామరసాక్షిఁ దలంచి నెమ్మదిన్.

ఉ. కమ్మనియూర్పులా సురటిగాడ్పులచే మకరాంక కేళిమైఁ
గ్రమ్మిన ఘర్మవారికణికల్ హరియింపుచు సేదదీఱఁగా
ఘుమ్మను మోవిపానకము గ్రమ్మర నిచ్చి పునారతిక్రియన్
సమ్మద మందఁ జేయు నలసారసలోచనఁ గూడు టెన్నఁడో? 19

మ. కలయం గ్రుమ్మడి వీడి జాఱెడుకురుల్ గాటంపు పెన్మబ్బుగా
వలపుల్ గ్రమ్మఁగ రాలుపూలు కరకవ్రాతంబులై నిండ, మైఁ
బులకల్ పుట్టఁగఁ జేయు నూర్పువలిగాడ్పుల్ మించ
నింకెన్నఁడో
కలకంఠీమణి పంచసాయకనిదాఘంబుం దొలంగించుటల్. 20

ఉ. వెన్నెలఁగాయ నాయురము వీపునఁ జేరఁగ నొత్తగిల్లి తాఁ
జన్నుల తంబురా నిలిపి చల్లఁగ నాపయి పంతువాడుచున్
తిన్నఁగ నర్థముల్ తెలుపు తీరున మర్మముసోఁక పాడి క్రే
కన్నుల నవ్వునట్టి కలకంఠిని గౌఁగిటఁ జేర్చు టెన్నఁడో? 21

గీ. విరహిజనములపై వేఁటవెడలు మరుని
జిగురుఁగండెలు కాఁబోలు చెలువచూపు
లందు గట్టిగ నంటిన యట్టి నాదు
మనసు మరలక యున్న దేమనఁగనేర్తు? 22

సీ. వలకారిచూపులు దెలిపెను భావంబు
కలికి యేమోకాని పలుకదయ్యె?
నిలుకుగుబ్బలచాయ లెదురుకోలు ఘటించె
పడఁతియేమో యొరపాటుసేసె?
ముసిముసినగవు సొంపులు సేదఁ దేర్చెను
వెలఁది యేమిటికినో వెతలఁబెట్టె?
ననురాగమెంతయు గనుపించె వాతెఱ
తెఱవయేమో సమ్మతించదయ్యె?

గీ. నేమి యనవచ్చు నక్కటా! మామకీన
సమసమయజాత భావనా సాహచర్య
కందళన్మోహ సన్నాహ ఘనఘనా ఘ
నాంత విద్యున్నికాంతంబు లింతి నటలు. 23

గీ. కలువ విరిదండ సారించు కరణినున్న
నున్నతామోదమునఁ దేలియుంటి గాని
బాలచూపుల వెంటనే వాలుదూపు
లించువిలుకాఁడు సంధించి యేయుటెఱుఁగ? 24

గీ. ఎపుడువచ్చునో యిచట కయ్యిందువదన
ఇంతతామసవకాటకు హేతువెద్ది?
ఏయుపాయంబుచేత నీరేయి గడచు
ననుచు జింతింపుచున్నట్టి యవసరమున, 25

చ. కొలకొలమంచు నంచగమి గొబ్బున నాసురపొన్నగున్నలన్
వలగొను కన్నెగొజ్జఁగుల పైపునఁ బాఱెడు మంచుగాల్వ చెం
తల గుబురైన కప్రపుటనంటుల నంటుల జల్వాలూఱఁ జెం
గలువ కొలంకు చెంగటను ఘుమ్మను పూఁబొదరిల్లు చేరినన్. 26

క. కలకంఠి యచట నుండఁగ
కలహంసలు ముద్దునడలఁ గలిగిన సొలపుం
గులుకులు నేర్వం జనియెను
పలికించెద నింతి ననుచుఁ బతియిట్లనియెన్. 27

ఉ. నేరముగల్గెనేని మది నిల్పకు మేఁదలంపఁగ లాఁతినే
వారణరాజయాన! యనివారణ నీవొక శిక్షసేసినం
గారవమంతకన్న మరికల్గునె? ఊరకె యుల్లి కేళికాం
తారలతాగృహంబున వితావిత నేఁటికి దాఁగ నేఁటికే? 28

ఉ. కానకయుండ డాఁగుటలుగా మరినేరుపు, కన్నుపిమ్మటల్
మానిని! డాఁగియుండుట చమత్కృతియే? కృతిఁజేసి నన్ను నీ
యాననచంద్రచంద్రికల యందము చందముచూపి మన్మథ
గ్లాని యడంప కిప్పుడు విళంబము సేసిన నిల్వనేర్తునే? 29

ఉ. జవ్వని యివ్వనిం బొదలచాటున నీటునఁ బల్కకుండుటల్
నవ్వులకో నిజాలకునో నాయెడ నీవొక తప్పుఁగంటివో?
చివ్వలుగోరి నీచెలులు సేసిన సేఁతలొ? యైననేమి! యీ
పువ్విలుబోయ యేయ నిటఁబొంచెను వంచనయేల? యేలవే!

గీ. వింతవాఁడనె యకట! నీవింత యలుగ
కోపనా! యేల చాలు! నీకోపనటన

రమ్ము నీగుబ్బచన్ను లురమ్ముఁజేర్పు
నానవూనిన వలరాజు నాన నీకు. 31

క. అని యనురాగము మీఱఁగ
వనజాక్షుఁడు సరసవాక్యవైఖరిఁ గేళీ
వనకుంజ పరిసరంబున
ననునయ మొనరింపుచున్న యంతటిలోనన్. 32

సీ. కర్నాటకపుతీరు గలనిక్కుకొప్పున
సవదరించిన సన్నజాదిసరుల
గుత్తంపు వలిగబ్బి గుబ్బచన్నులమీఁద
నసియాడు ముత్తెలహారములను
రవికపూనినయట్టి రహివహింపఁగ మేనఁ
దనరారు చల్వగందంపుఁ బూఁత
నుదుటు లేజాబిల్లి యొరపొందు నుదుటను
దీర్చిన కపురంపుఁ దిలకమునను

గీ. మొలచి చిగురించి యంతట మొనయనల్లి
పూచు వెలినిగ్గు తీవెల ప్రోదిగన్న
పండువెన్నెలతేటలు పైఁజెలంగు
మేలి తెలిసాలియ ముసుంగు మించునించ. 33

ఉ. వెన్నెలతేటయో? చెఱకువిల్తుని గెల్పులపువ్వుఁగోలయో?
కన్నులఁగానుపించు త్రిజగన్నుత మోహనమంత్ర విద్యయో?
మన్ననఁగన్న యన్నలువ మానసస్పృష్టియొ? యంచు
నెంచఁగా
గన్నియ ముద్దునెన్నడలఁ గొనసియాడఁగ నిల్చె నయ్యెడన్.

సీ. గుబ్బచన్నులు కేలఁగూర్చిపట్టకమున్న
మిసమిసల్ కై దండ లొసఁగఁదొడఁగె
వాతెఱతేనియల్ వలపింపకయెమున్న
చవులంతకంతకు సందడించె
మక్కువతోఁ జేరి మాటలాడకమున్న
మున్నాడుభావంబు మొలకలెత్తె
నిండుకౌఁగిటఁజొక్కి యుండు నంతకమున్న
యంగంబు మిగుల నుప్పొంగుచుండె

గీ. పల్లవాధర పొదరింటి పజ్జనిలిచి
చంచల కటాక్ష పాత సంజాత హర్ష
బంధురసవర్ష ధారాతి పరిచయమునఁ
బతికి ననురాగలతికలఁ బాదుకొల్ప. 35

క. జల్లున మైఁబులకింపఁగ
నుల్లం బనురాగజలధి నోలాడంగా
పల్లవపాణిని లలనా
పల్లఃవసాయకుఁడు చూచె ప్రమదం బెసఁగన్. 36

గీ. అమృతరసధార మనసార నానుకరణి
తళుకు సంపంగిదండ మై దార్చుసరణి
కౌఁగిట బిగించి వెన్నుండు గారవించి
నిలిపె విరిసజ్జఁ దనచెంత నెలఁతనంత. 37

ఉ. నానలుదీర్చునట్టి వచనంబుల శయ్యకుఁదార్చు పల్కులున్
మానముమీటు మాటలును మర్మములన్ వెలిఁదేర్చు
సుద్దులున్

దేనియలూఱునారజపుతీరుల వింతరహఃప్రసంగముల్
మానసికమ్ములై చెలఁగ మానినికిన్ మధుకైటభారికిన్. 38

సీ. సరసంపు బలికింపు సరణుల సడలించి
యుత్తర ప్రత్యుత్తరోక్తులెల్ల
చిఱునవ్వు తేటలచేతనే ప్రకటించి
మనసులోఁ గలిగిన మమతలెల్ల
గాటంబులౌ నిండుకౌఁగిళ్ల వివరించి
ప్రబలానురాగ సంపదలనెల్ల
మోముమోమునఁజేర్చి ముద్దాడుటను దెల్పి
కలయికఁగలుగు నాకాంక్షలెల్ల

గీ. వచనరచనాదికములైన వైపులెల్ల
బరిహరించియు నుల్లంబు పల్లవింప
సమయసముచిత సురతప్రసంగరీతి
నంగనఁ గరంచె నల మోహనాంగుఁ డపుడు. 39

క. హరియించె వారి బడలిక
పరిసర కాసారతీర పరిచిత హంసీ
గురుదంచల హతి చంచల
సరసిజదళ తాళవృంత జాతానిలముల్. 40

సీ. కేళీగృహములోవ కెలఁకున వెన్నెల
బయట కేళాకూళిపజ్జ పసిఁడి
చవికబవంతిలో జలసూత్రములనుబ్బి
దుముకెడు పన్నీటి ధూమ్రములను

పొడమెడు చలువచేఁ బ్రొద్దొకవింతఁగాఁ
బొదవెడు గొజ్జంగి పొదలయందు
చిందు తేనియకున్నె చిందులుద్రొక్కుచు
మెదలెడు గండుతుమ్మెదల రొదలు

గీ. లక్షణానుక్షణప్రేమ లక్ష్యలక్ష్య
మదనమాంత్రిక మోహనమంత్రమగుచు
మదనజనకుండు మదికి సమ్మదముసేయ
వేడ్కతోనుండె శశికాంత వేదినంత. 41

జారిణి – లక్షణ

ఉ. వారము నేఁడెయంచు యదువల్లభు రాకను గోరి లక్షణా
సారసగంధి కేళిమణిసౌధము తాఁగయిసేసి వేడుకన్
హారపదాంగద ప్రముఖహారిణియై తపనీయమందిర
ద్వారమునందు నిల్వ నొక వారిజలోచన చేరియిట్లనెన్. 42

శా. బంగారానకు వన్నె పెట్టినగతిన్ పద్మాక్షి! నీమేనిపై
సింగారంబు చెలంగె కేళిభవన శ్రీసంవిధానంబులున్
రంగైమించెను నాథుఁడేమిటికిఁగా రాడంచు చింతింప కీ
సాంగత్యం బొనరింతు నంచు చెలియుత్సాహంబు సంధిల్లఁగన్

సీ. కొనగోర మొగలిరేకునఁ గమ్మకస్తూరి
వలపువక్కణచీటి వ్రాయవమ్మ!
మచ్చికతో జేరిమాటలాడెదనైనఁ
బలుకుదోడుగ చిల్కఁబంపవమ్మ!
అతఁడు నీవును రహస్యంబున గుఱుతుగా
బలికిన బలుకులు దెలుపవమ్మ!
తనుఁజూచి నటువలె తరుణిఁజూడ మటంచు
నిచ్చిన యుంగర మియ్యవమ్మ!

గీ. రాజగోపాలుఁడన్నింట రసికుఁడౌను
సయినదెలిపెద నానేర్పు నతిశయిల్ల
నతని చిత్తంబు నీభాగ్యమైక్యమంద
మందగజయాన! నమ్ము ముమ్మాటికిపుడు. 44

క. అనవుఁడు నెచ్చెలిఁ గనుగొని
వనితామణి చిలుకతోడు వలయునె? నీవే
చనిసం గార్యంబగు నన
ననిపించుకజనియెఁ జెలియు నలహరికడకున్. 45

గీ. కోటిమన్మథ లావణ్యకోటియైన
వల్లవీజారు ముందర వచ్చి నిలిచి
మందమందాక్షురంబుగ మందగమన
పలికెఁ బలుకులఁ గపురంపుఁబలుకు లొలుక. 46

మ. తరుణీరత్నము నీదు రాకలకు సౌధద్వారభాగంబునం
జరియింపన్ మణిహంసకారవము సాజాత్యంబునం గేళికా
సరసీజాకరతీరచారులగు నంచల్ వెంబడించంగ ని
ర్భరసంతాపముజెంద కుండ ననుకంపన్ నీవు గావందగున్.

చ. అరవిరులన్నఁ జూచుటకునైనను సమ్మతిసేయనట్టి యా
సరసిజనేత్ర బంగరువుచప్పరమంచము చంచలాక్షులన్
సరిగ నలంకరించుఁడని సారెకుసారెకు నెచ్చరించి పూ
సరములు నిచ్చు నీవు రభసంబున నింటికి వచ్చు వేడుకన్. 48

గీ. ఎదురుచూచుచు నీరాక కిందువదన
కమ్మకస్తూరిచే తిలకంబు దీర్చి

భావిమన్మథసంగర ప్రౌఢవిజయ
కారియైనట్టి యల చిక్కటారి యనఁగ. 49

చ. చెలువుఁడ! నీదుభావరసచిత్రము నేర్పులు మీఱ వ్రాసి యా
కెలకుఁన వింతవింతగ లిఖించిన యాత్మవిలాసభావముల్
జెలులు కనుంగొనంగ నునుసిగ్గున నవ్వుచు తేటచెక్కులం
దలమికొనంగ నున్న చెలియందము లేమని విన్నవించెదన్. 50

సీ. కనకపాత్రికలఁ బంకజరాగ దీపికా
కలికల నారాత్రికల నమర్చి
మణులసంబెళలతో మగరాలబాగాల
బరణులు తగనడపంబుగట్టి
మలయుంపువలిగాడ్పు మొలకలుచిగిరించ
నలరు వీజనములు నలవరించి
ఘనసారమృగమద గంధసారమ్ముల
ఘుమ్మనం గలపంబుఁ గలయఁగూర్చి

గీ. మలయు రతనంపు కీలుబొమ్మలనుగూడి
పడఁతి నడయాడు మాకు నేర్పఁ్పఱుపఁదరమె?
యింతియిది బొమ్మలివి యంచు నెఱఁగివేడ్క
సేవసేయించికొనజాణ వీవె జగతి. 51

చ. సొలపుల నీదు రాకలనుఁ జూచు మృగేక్షణ వాలుచూపులం
గలువల తోరణంబులనుఁ గట్టినకై వడి సౌధమార్గమున్
జెలఁగుచునుండ మున్నె కయిసేయుటగాఁగ బ్రసాధికామణుల్
పలుకఁగఁ జూచి నవ్వు మణిపంజరకీరము లెల్ల గేరుచున్. 52

చ. కెలఁకున జిత్రమందును లిఖించిన నీప్రతిబింబమందమై
నెలకొని నిల్వఁబట్టమొక నెచ్చెలి దేరఁగఁజూచి దవ్వనం
జెలువుఁడు వచ్చెనంచుఁ గయిసేయుచునుండి విభూషణావళుల్
నెలవులు దప్పఁబూను రమణీమణి తత్తరమేమి చెప్పఁగన్. 53

చ. తలిరులు వాతెఱల్ విరులదండలు చూపుల నాణిముత్తెముల్
పలువరుసల్ సరోజములు పాదయుగంబున మించుటద్దముల్
తళుకుమెఱుంగుఁ జెక్కులనుఁ దా సవరింపుచు నీదురాకకై
కలికి ప్రసాధికామణుల కన్న నలంకృతిఁగూర్చె మేడకున్. 54

సీ. మొగముసోయగముచేఁ బగటువో మీటిన
యలనాఁటి పగదీర్తు ననియె విధుఁడు
కులుకుఁబల్కులచేత నలుకపుట్టించిన
యలనాఁటి పగదీర్తు ననియెఁ జిల్క
ముద్దునెన్నడలచే గద్దించికదిమిన
యలనాఁటి పగదీర్తు ననియె నంచ
నెఱిగొప్పుకప్పుచే నెఱిదప్ప దరమిన
యలనాఁటి పగదీర్తు ననియెఁ దేఁటి

గీ. ఏల యొకమాట మాటఁగ నించువిలుతుఁ
డెపుడు సెలవనునని మదినెంచియున్న
యతని బలగంబునెల్ల నిట్టట్టుసేసి
రామనేలర యేలరా రాజసములు. 55

గీ. అనుచుఁబలికెడు దూతితో ననియెవిభుఁడు
సారసారెకు నిట్టులో సారసాక్షి!
ఇంత దెలుపంగ వలయునే! యింతికొఱకు
నిపుడె వచ్చెదఁ జనుమని యొసఁగ మొసఁగ. 56

సీ. విరినిగ్గు వెలిఁజిమ్ము వింతయోర రుమాలు
మీఁదముత్తెపుతురా మించుమించ
మెఱుఁగుఁజామనచాయ మేనిపై నెత్తావు
లడరఁ గుంకుమగంధ వొడియలంది
జారికట్టినయట్టి సరిగె దుప్పటికొంగు
వామాంసమున వల్లెవాటువైచి
పైగోవకెంపురాపలక చెక్కడముల
వెలహెచ్చుకడియమ్ము లలవరించి

గీ. వజ్రమాణిక్యమయ బహువలయరుచులు
రహివహింపంగ తారహారములు పూని
మురువుచెవిచెంత నొక వింతమురుపుచూప
మేఘవర్ణుండు చెలియున్న మేడ చేరి. 57

శా. లీలాసుందిర శిల్పకల్పకలనాళీలోక మాలోకన
శ్రీలాలిత్యము మీఱ సత్వరముగాఁ జెంతం జరింపన్ సరః
కేళీహంసము లాత్మనూపుర రవాకృష్టంబులై క్రమ్మరన్
నాళీకేక్షణః విభ్రమోచితవిధానై పథ్యముల్ మీఱఁగన్. 58

క. తనరాక కెదురుచూచుచు
కనుఁగవ దరహాసచంద్రికలం బైఁజిలుకన్
గనుఁగొని యప్పుడు హరియును
మనసిజ సంచాల్యమాన మానసుఁడగుచున్. 59

చకితసారంగలోచన సరస కరిగి
వెలయు భవనాత్మ శృంగారవిభవములను
మేలుమేలునఁ దనమీఁది మేలుఁదెలుపు
నిందుబింబాస్యతోడఁ దానిట్టులనియె. 60

మ. కలకంఠీ! యపరంజిమేడకు నలంకారంబుఁ గావించు నె
చ్చెలులన్ సారెకుదూర నేమిటికి? నా చెంతన్ దరాపాంగముల్
సొలయన్ నీవొకమారు చూడ నవియే సొంపుల్ పిసాళింపఁగా
నలరున్ మ్రొత్తములై దుకూలలతలై హారంబులై మించవే 61

శా. సింగారించుట మామకాగమశుభశ్రీ సిద్ధికై కాక యా
బంగారంపు మెఱుంగుదీవెలకుఁ బైపై మించుల న్నించు నీ
యంగం బంగజురాణి రత్నములబొమ్మా! కొమ్మ! నీచంచలా
పాంగంబుల్ పచరించ నేసలిడె సుప్రాణుల్ మణుల్
చిందఁగన్. 62

క. అంగన! కై సేయుచు భవ
నాంగణమున నున్న వనుచు నప్పుడె వింటిన్
బంగారువంటి మేనికి
సింగారము వేఱెకలదె? శీతాంశుముఖీ! 63

చ. అని సరసోక్తులాడి దరహాసము కన్గొనలంది గూర్పఁగా
మనసిజ రాగమగ్న నిజమానసుఁడై చెలరాల సంతనన్
మినుకుల నీను బంగరువుమేడకడన్ బువుచప్పరంబులో
ననుపమ రత్నవేదిపయి నంగననుంచి మనోహరంబుగన్. 64

శా. లోలాక్షీ! విను నీకటాక్షసరసాలోకంబు లోకంబునన్
గాళిందీసవిలాసమై ఖరుల జోకల్ మించె నావల్లభుం
డాలీలావతినాథుఁ డన్యసతిఁ దానాత్మం బ్రశంసించినన్
దా లోనల్గిన నల్లనేఁటికని దానల్గన్ విభుండత్తరిన్, 65

గీ. ఇటులమాటల వెంబడి నేకశయ్య
విరహతాపంబు మిగుల నుద్వేలమైన

మదనజనకుండు నప్పు డమ్మదవతియును
తలఁచి రీరీతి తమతమ తలఁపులందు. 66

ఉ. చీటికిమాటికల్గి తమచెంతలనున్న సఖీజనంబు నా
నాఁటికి ప్రేమబంధముల నర్మములంగొన నైచి నేఁడునం
గూటమి సంఘటింప జత గూడిన వారలఁ గేరి నెమ్మదిన్
నాఁటిననాఁటి నెమ్మి నెఱనమ్మిన పట్టున నింతపుట్టునే? 67

మ. వలగోఁబన్నినఁబూవు చప్పరము క్రేవన్ మించు నెత్తావికిం
గలయం గ్రుమ్మరు గండుతుమ్మెదలు రాకల్ గాంచి
యామన్మథుం
డలుకల్ మానఁగఁ జేయుదూత్యము విధంబై తోపసంతాపముల్
చెలఁగన్ మున్నుగ గుట్టువీడుటకునై చింతింతు రన్యోన్యమున్

చ. సరసత మీఱఁగా విరులశయ్యను నెయ్యముతోడ నున్నవా
రిరువురు నంచు జిత్తమున నెంచు సఖీమణు లిప్పుడక్కటా!
విరహనితాంత వేదనల వేఁగుట నించుక యేనెఱుంగ రె
వ్వరు మరుపెట్టిసేయు విధివంచనలం దొలఁగింప నేర్తురే?. 69

మ. వలిదిచ్చోనిఁక మాకు నెచ్చెలులు సేవల్ సేయ నీజాళువా
తళుకుంబొమ్మలె చాలునంచు మది మోదంబంది యేమున్ననీ
కలకల్ పుట్టినయట్టి పట్ల మఱి యాగాదంచు బోధించఁగా
వలఁతుల్ గావని యెన్నవైతిమివి యెవ్వారింక వారింతురో! 70

గీ. కలికి చిలుకలఁ జదివించి గారవించి
ప్రోడలనుఁ జేసి దూత్యంబు జాడఁ దెలిపి
యున్న బట్టున నూరకయుండెఁ వింటి
పక్షపాతు లటంచును బల్కఁదగునె? 71

మ. తలిరుంబాన్పులు పండువెన్నెలలు నెత్తంబుల్ లతాగేహముల్
చలిగాడ్పుల్ హరియించు తాపమనియెంచన్ వీటిచే మించెను
జ్జ్వలసంతాప భరంబులేమనుచు చర్చల్ సేయఁగావచ్చు దు
ర్లలితుండై వలరాచవేల్పు ప్రతికూలత్వంబు వాటింపఁగన్ 72

చ. అలుకలు పుట్టినేమిటికి నక్కట! యక్కటికంబు మీఱఁగా
పలుకకయుండనేల యని పల్కఁగజూతురు చూచియంతలో
నెలకొను మానగౌరవము నిల్పఁగనిల్తురు నిల్చి యాత్మలోఁ
గలఁగుదు రింతెకాక పలుకం గమకించరు మంచి యెవ్వరున్.

చ. మలయసమీరసంగతిని మైగల తావులుగూడి పైపయిన్
మలయుచునుండ కూటమి దమిం దలపోయుచునుండి తోడనే
తొలఁగిన మేనికాఁకలనుఁ దూలుట సోలుట దక్క నక్కటా
జలమునుఁ బూనరింతయుఁ బ్రసన్నత కోపభరమ్ము లెట్టివో? 74

చ. తలఁచినయట్టులెల్లను ముదంబున ముద్దులు గుల్కు పల్కులన్
బలుమఱుఁ బల్కి పల్కి రసభావముచే నరమోడ్పు కన్నులం
గలరవదంపతుల్ మెలఁగఁగా మరి కన్నులఁజూచుటెట్టులీ
తెలియుని మూఁగయల్క కడతేఱుటలెన్నటికింక దైవమా!

ఉ. పాలునునీరునేర్పఱచి పాలుగ్రహించిన యంచలట్లనే
మేలునుఁగీడు నేర్పఱచి మేలుగ్రహింపుచు వేడ్కనుండి యే
వేళల నల్గునట్టి యవివేకులనవ్వాదుమట్టిపట్ల నా
వాలినప్రేమడిందఁ బగవారలఁగూడెను దైవమక్కటా! 76

చ. మొలిచినమోహభారమున ముందర నంతఃప్రియాను
లాపముల్
బలికినయట్టులైన తమభావముల న్నెలకొన్నగూర్మిచేఁ
దొలుతటియల్కలన్ మఱచి తోడనె వారు రసాతిరేకతం
జెలఁగిరి మాధవుండపుడు చిత్తమునన్ ననలొత్తవేడుకన్.77

గీ. నేర్పుమాటల మచ్చికలేర్పరించి
చూపు వెంబడి వలపుల సోనగురియ
చికిలిక్రొవ్వాడికొనగోరు చిఱుతసోఁకు
లంది నొకకొంత గిలిగింత యంకురింప. 78

చ. మనసిజశాస్త్రమర్మములు మాటికిమాటికి నేర్పుమీఱఁగా
బెనఁకువలందు దెల్పుచును బింకపుజంకెన వాఁడిచూపులన్
మనములయందు సందుకొను మచ్చిక హెచ్చఁగ నిండుఁగౌగిటన్
వనరుహనేత్రి దేల్చె యదువల్లభుఁ డుల్లము పల్లవింపఁగన్. 79

ఆశ్వాసాంతము

మ అవనీయాచక హర్షదాయి వసుధారాజీవ! రాజీవ స
న్నవనాహారణ లక్ష్యలక్షణకళానాసత్య! నాసత్యమా
ర్గవిరోధిక్షితిపావరోధితమహా కాంతార! కాంతారణ
న్నవమంజీరనినాద మోదితమనోనాళీక నాళీకనా! 80

క. ధారాధరలాలస దసి
ధారాదళితారి రక్తధారాళ ధరా
ధారాటనభానిర్జిత
ధారాధరధైర్యదానధారాధారా! 81

కవిరాజవిరాజితము

ప్రతిగజవారణ భీకరవారణపాటిత వారణశృంగఘటా!
తతపురకారణ వైరివిదారణ దారణకారణసైన్యభటా!
క్షితిహితధారణ కృత్యవధారణ సిద్ధసుధారణ కీర్తిభటా!
చతురవిచారణ సద్గుణచారణ సంభ్రమచారణగాంగతటా!

క. అపమానమానమానిత
తపనీయధరేంద్ర సాంద్రతరకాంతిమహా
స్తపనాభ్యాంతధ్వాంత
ద్విపుయూథా! "ముద్దుచంద్రరేఖా" నాథా! 83

ఇతి శ్రీమత్కాళహస్తీశ్వర కరుణాకటాక్ష లబ్ధసిద్ధసారస్వతనయ చెంగల్వ వెంకటార్యతనయ విజయరాఘవ భూపప్రసాదాసాదితవివిధరాజచిహ్నచిహ్నిత భాగధేయ కాళయనామధేయ ప్రణీతంబైన, రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబునం ద్వితీయాశ్వాసము. 84



శ్రీరస్తు.

# శ్రీ రా జ గో పా ల వి లా స ము.

## తృతీయాశ్వాసము

శ్రీకలితదానతోషిత
లోకాలోకాంతరస్థలోకాలోక
వ్యాకోచోత్పలరేఖా
రాకేందుసరూప! విజయరాఘవభూపా!. 1

గీ. అవధరింపుము! సూతసంయమివరుండు
శౌనకునితోడ సిట్లను శౌరియట్ల
భద్రలక్షుణఁ దేలించి ప్రమదముసను
మఱియు గరితలపై చాల మమతయుంచి. 2

విప్రలబ్ధ-జాంబవతి

క. అంతట నా జాంబవతీ
కాంతారత్నంబు దూతికామణితో నే
కాంతంబునఁ బలికెదు నల
వింతల నొకకొన్ని వినెదు వేడుకతోడన్. 3

చ. పలచఁగఁ బూసినట్టి కలపంబునఁ బుట్టిన వింతవాసనల్
కొలనికెలంకు పూఁబొదలకున్ నెఱితావుల సొంపునింపఁ బై
వలిపెపు దుప్పటీచెఱఁగు వల్లెడవైచి యదూద్వహుండు దా
సొలపునమాపి లేఁజిగురు జొంపపుసందులఁ జూచుచుండగన్.

క. కలకంఠకంఠి యచ్చట
చెలువుని వంచనకుఁ దనదు చిత్తములోనం
గలఁగుచు మరుబాములచే
నలమటఁ బడి దూతితోడ నవుడిట్లనియెన్. 5

శా. చింతాసంతతిఁ జిక్కి చెక్కిటిపయిం జేఁజేర్చి చింతింప నీ
ప్రాంతారామనికుంజ పుంజములచాయ న్నిల్చి వామాక్షి! నీ
కాంతుం దెచ్చెదనంచు వేవుదనకుఁ గాసింబడంజేసితే?
కాంతా! యాప్తులు సేయుమాయలకు లోఁగాకుండు
వారెవ్వరే? 6

క. తగవులు తెగువలు బిగువులు
నగవులు పైపూఁతవలపు నయగారములున్
మగువా! యీవగలెల్లను
మగవానికిఁ జెల్లుఁగాక మగువకుఁ దగునే? 7

ఉ. తల్లడమేల? నీవరునఁదప్పనటంచు ననేకనాయికా
వల్లభుఁడాడు మాట నెఱవంచన యంచు దలంచనైతినో
హల్లకపాణి! యీవికచ హల్లకజాతపరాగజాతముల్
చల్లనిమేనిపై సెకలుచల్లఁగ నేగతి తాళనేర్తునే? 8

ఉ. ఎన్నఁడుసమ్మతించు నిఁకనెన్నఁడు నన్ దయమీఱఁజూచు నిం
కెన్నడు మాటలాడు నిఁకనెన్నఁడు కౌఁగిటగారవించు నిం
కెన్నడు పుణ్యమెల్ల ఫలియించునొ? యంచుఁ దలంచునాథుఁడే
సన్నిటు చౌకసేసినను నాతిరొ! యేగతి నోర్వవచ్చునే. 9

చ. అంచలనంచలుండ మలయానిలముల్ మలయంగ చెంగటన్
పంచమనై ఖరుల్ తరులపంచఁ బ్రపంచముసేయఁ గోరుటల్
పొంచి మరుండు నన్ను సురపొన్నలకోరికి సూటిసేయఁగా
వంచన లిట్లు సేయదగవా? పగవారికి నైన నక్కటా!. 10

సీ. చెక్కున మకరికల్ చికిలిగోరున వ్రాయు
నపుడునాతోడ నేమనియె మున్ను?
మేడచేరువకుఁ దా మెల్ల మెల్లనవచ్చి
నను సన్న సేసి యేమనియె నాఁడు?
నిచ్చవెన్నెలగాయు ముచ్చటలాడుచు
నతిరహస్యముగ నేమనియె మొన్న?
నెలదోఁటలోన రేయెల్లను విహరించి
యకట! వేఁడువనె నేమనియె నిన్న?
గీ. పలికి బొంకనివాఁడంచుఁ బలుకదెపుడు
నింతలో వింత లోయింతి! యేమిపుట్టె?
నౌర!యీ మోహనాకారుఁ డాచరించు
మాయ లిటువంటి వందుకే మాయనిపుడు.

క. మగవారికిఁ గలగుణముల
మగువల వలపించు దనుక మమకారంబుల్
మగువలు వలచిన పిమ్మటఁ
దగవులు మఱి వేఱెకావె తామరసాక్షీ! 12

క. కలలోన నైన నెన్నఁడు
పలుకులుజవదాఁటకుండు పతికిఁ సతికిఁ
కలిగెను సిలుగని సవతులు
కలకలనవ్వంగఁ దాళగలనా! లలనా! 13

సీ. ఎంతనేరము చేసి యేనియు నాచెంత
నిలిచినఁగోపంబు నిలుపనేర
చూపులలో వింతసొగసులు చిగురించఁ
జూచిన వెగటుగాఁ జూడనేర

నాగడంబులు డాఁచి యతివినయంబుగాఁ
బలికిన మరుమాట వలుక నేర
మమతతోఁ దొల్లింట మచ్చికలెన్నియే
నెన్నినఁ గొదవల నెన్న నేర

గీ. వనిత యొకతప్పు గావంగవలయు ననుచు
నున్న నెటువలె గడిఁదేటి యుండఁదొడఁగె
వలచి నట్లుండి వలవని వల్లభునకు
వలచినటువంటి తప్పు నావలన నింతె. 14

క. అని పతిచేసిన వంచన
కనుపించును నేరమెన్నఁగా నావేళ\
విని వినయంబు నయంబునుఁ
బెనఁగొన నిట్లనియె చెలియ బిత్తరితోడన్. 15

మ. వలదే కోకిలవాణి! యేమిటికిఁగా వ్యాఖ్యానముల్ మీరలా
నెలయున్ వెన్నెలయుంబలెం బదనరఁగా నెయ్యంపుఁ
గయ్యంబునన్
గలకల్ పుట్టవా? తేరవో? తొలుత నీకాంతాళముల్
గంటిమే?
కులకాంతల్ పతినేర్పునేరముల కెగ్గుల్ పట్టిపల్లార్తురే? 16

గీ. గుణము గోరంతఁగలిగిన కొండసేయు
నెంత నేరంబు చేసిన నెన్నఁడెపుడు
చాడిచెప్పిన మనవిగా సంగ్రహించు
రాజగోపాలు గుణమిది రాజవదన! 17

ఉ. ఎంతతపంబు చేసితివొ! యెంతటివేలుపు భక్తిఁగొల్చితో
యెంతవ్రతంబు సల్పితివొ? యెంతటిభాగ్యము సంతరించితో?
యెంతటినోము నోచితివొ! యెంతటిదానము నాచరించితో
యంతటివాఁడు నీకుఁ బతియౌటకు నంబుజపత్రలోచనా! 18

చ. కలకలు మీకు నెన్నటికి గల్గునొయంచుఁ దలంచి నేర్పుగా
నలుకలు పుట్టఁజేయుచుఁ బ్రియంబులు వల్కినయట్టి పిమ్మటన్
వలపులు కొన్నికొన్ని కొనవైచి మిముం జతగూర్చునట్టి యా
కలికి పిసాళి జంతలము గాముగదే! గజరాజగామినీ! 19

క. అనిపలుకు దూతి పలుకుల
మనమునఁగల కోపభరము మట్టుపడంగా
తనరాకలు మదిఁగోరెడు
వనజానన హృదయమెఱిఁగి వల్లభుఁడంతన్. 20

శా. ప్రోడల్ చూచి సజీవచిత్రముల సొంపుల్ మించ నానానట
నీడల్ దేలెడు నిల్వుటద్దముల వన్నెల్ మీఱ జాబిల్లిరా
గోడల్ కాంతల బింబసంపదల దిక్కుల్ నింప లేఁగెంపు రా
మేడం జేరెను జాళువావలువ క్రొమ్మించుల్ దువాళించఁగన్.

ఉ. అందు విలాసరేఖ యిటులాకృతిచే రహిఁ గాంచెనోయనం
గుందనపుంబసిండి తళుకుల్ వెదజల్లుచు క్రొమ్మెఱుంగె యీ
యందమునందెనా నలరు నంగనచెంగట వచ్చినిల్చినన్
గందళితానురాగ రసకందళమానసుఁడై ముదంబునన్. 22

లేమకెంగేలు కేలఁగీలించి పట్టి
సరసనున్నట్టి విరవాది చప్పరంబు
చవికెలోపలి పసిఁడిమంచంబు నందు
విరులునించిన శయ్యపై వెలఁదినుంచి. 23

సీ. పాన్పుపైఁ గూర్చుండి భాగాలొసంగుచో
చేసోఁకుటకుఁ గొంత చిత్తగింప
తనుఁజూచి మాటాడ ధవుఁడుఁ బ్రార్థింపంగ
మాటలాడంగ నెమ్మదిఁదలంచి
సకినల బటువులు సరసకు దివియంగ
మొలచిన జిలిబిలి ముద్దుబలుకు
రవళికం గెరలు పారావతమ్ముల మించు
కలరవమ్ముల మాటుగా నొకింత

గీ. తెలిసి తెలియదటన్న సందేహమలర
చిగురుకెమ్మోవి ననలొత్త చిన్నినగవు
బెళకుచూపుల రాగంబు పెనగొనంగఁ
బ్రమద పలికినపలుకులఁ బ్రమదమందె. 24

మ. కలయం బర్విన చూపుతూపు లెలగోల్గావించి వేమించి య
య్యలినీలాలకయుఁ విభుండు తమి బాహాబాహిఁ బోరాడఁగా
వలరాయండు ప్రసూనవర్షములతేవల్ చూపినట్లయ్యె న
య్యలరుంబోడికి కొప్పువీడి వడి క్రిందై క్రొవ్విరుల్ చిందఁగన్.

గీ. చూపుచూపును సరివోవఁ జూచియపుడు
హృదయములు రెండుసరియౌట నెఱుఁగవేఁడి
గాఢపరిరంభ సంభ్రమ కైతవమునఁ
బాయకుండిరి వేడ్కతోఁ బతియు సతియు. 26

క. రతిచాటువులను నిర్జిత
రతియగుసతి మనముగరంచి రాగముమీఱన్
రతులం దేలిచె యాహరి
యతులిత సమ్మోదగర్భితాశయుఁడగుచున్. 27

—: ఖండిత మిత్రవింద :—

చ. అల మెలదోఁటలోనఁ దరళాయతలోచనఁ దేల్చి వేడుకన్
వెలువడి మిత్రవింద గడు వేఁడుకొనం దమకించు నేర్పులం
దలఁపున నిల్పి యవ్వికచతామరసేక్షణ పైఁడిమేడఁ దా,
సొలపునఁ జేరె రూపజిత సూనశరాసనుఁ డొయ్యనొయ్యనన్.

ఉ. చెక్కిటగోరులున్ నిదురచిన్నెలు చూపెడి వాలుఁజూపులుం
బుక్కిటివీడియంబును గుబుల్కొను మేను జవాదివాసనల్
టెక్కులుచూప మీన్‌బిరుదుటెక్కమువాని విలాసవైఖరిం
జొక్కుచు వచ్చు నాయకునిఁజూచి కషాయిత లోచనాంతయై

గీ. వెగ్గలంబయి మది వెలి విసరినట్టి
కోపరసవేగ మొకకొంత కుదురుపఱచి
చతురగావున నప్పుడా సరసిజాక్షి
పలికె నిట్లని హేతుగర్భంబుఁగాఁగ. 30

మ. కలయం జాగరరాగరంజితకటాక్షశ్రీలు సాంధ్యప్రభ
న్నెలకొల్పన్ సమయానుకూలముగ నీ నిద్దంపులేఁజెక్కునం
దలచూపెన్ నెలవంక దానిఁగని యానందంబు సంధిల్లఁగాఁ
బలుమాఱుం గరపద్మముల్ మొగుడ సంభావించెదన్ వల్లభా!

చ. చెలువుఁడ! నీవు తామసముసేయుట కిప్పు డుపాయభేదముల్
వలుకఁగ నూహసేసెదవు భావములోవిను క్రొత్తలత్తుకన్
తిలకము వింతవింత వగ తీరున దిద్దినయట్టి తీరులే
తెలిపెను మాకునెంతయు తేటపడంగ విళంబహేతువున్. 32

ఉ. లోలత నీవు నా మనసులోపల నెప్పుడు సంచరించఁగా
నాలిజనంబు నిన్నుఁ దమి నచ్చట నచ్చట నుండివచ్చె నీ
వేళకు నంచుఁ బల్కు నవివేకపుమాటకుఁ గోపమేఁటికిన్?
దాళుము సర్వలోకవిదితంబులుగావె భవచ్చరిత్రముల్. 33

మ. కలయం జెక్కుల ఘర్మవారికణముల్ గ్రమ్మంగ నొయ్యారపుం
దళుకు న్నిద్దపుమేనిపై చిటులుగంధం బందమై మించ నూ
ర్పుల నెత్తావికి గండుతుమ్మెదలు గుంపుల్ గూడి వెన్నాడఁగా
భళిరా! వచ్చితి వీవు వేగ, రమణీపాంచాల! నాపై దయన్. 34

మ. నటనల్ జూపెడి యూర్పుదావులు, నలంతల్ చూపు వాల్ చూపులున్
చిటిలుం గుంకుమ క్రొత్తలేఁ జెమటయున్ శీర్ణాలక శ్రేణియున్
నిటలాలక్ష్యవిశేషకంబుగల యా నీలాలకం బాసి యు
త్కట మోహంబునఁ జేరవచ్చితివి వేగన్ నీవు నాపై దయన్.

సీ. కులుకుగుబ్బల సోఁకు కుంకుమరేఖల
మైపూఁత చేతను మాటి నపుడె
గళమునఁ గనుపించు నెలవంకగోరులం
గంటసరంబుచేఁ గప్పి నపుడె
జడ ప్రేటు మరుపడఁ గడవన్నె బంగారు
వలిపెదుప్పటి వల్లెవైచి నపుడె
సందిదండలు మొత్తు జాడల బాహాంగ
దముల పూనికచేత దాఁచి నపుడె

గీ. నేరుపరివౌదు వన్నింట నీవె జగతి
ముదురుచందురుఁగావి కెమ్మోవి మీఁద
నాఁట నొత్తిన పలుగంటి మాటుపట్లు
మఱపువచ్చిన నది నేరమా? తలంప. 36

ఉ. వాసనవీడి వాడి సిగవ్రాలెడు పువ్వులు నిన్నమాపు మైఁ
బూసిన యంగరాగములు పూని రయంబునవచ్చి తౌర! మేఁ
గాసిలియుండ నావిధమె కైకొని వల్లభ! ప్రాణవల్లభుల్
వేసటనున్న నాయకులు వేడుకతోఁ గయిసేయరే కదా! 37

ఉ. బాసలుసేసినిన్ను నెడబాయను నెచ్చెలి! యీప్రభాతమం
బాసలఁబెట్టి వచ్చియిపు డద్దమ రేతిరి దానికన్నునన్
వాసిఁగ బల్కెదిట్లు నెఱవంచన సేయఁగనేల? యౌర! యా
చాసలవంటివే యిపుడు వల్కినబాసలు ప్రాణవల్లభా! 38

చ. జలరుహనాభ! నాదు మణిసౌధముపజ్జకు వత్తువెప్పుడున్
వలగొన సంధ్య నీవటులె వచ్చితివిప్పుడు పూర్వసంధ్యగాఁ
దెలియఁగలేక నీవది మదింగణియింపకుమీ కొఱంతగా
కలయఁగ రాగసంపదలు కన్నులఁగ్రమ్మఁగఁ దెల్వికల్గునే? 39

గీ. పచ్చిగాయమ్ము లీరొమ్ముపైని హెచ్చ
మెచ్చి యారతు లీయంగవచ్చు నిపుడె
వెన్నుపైనున్న చెనకుల విధముఁజూడ
గెలుపునోటమి నేమియుం దెలియరాదు. 40

మ. అల జాబిల్లికి హెచ్చుగాఁగలిగె సంధ్యారాగ మారాగ మీ
తళుకున్నోమున నొందకున్న నెటులొందర్ వచ్చు నౌపమ్యమం
చలమన్నెమ్మది చింతనేర్పునని యాయందంబు చేకూర్చియున్
భళిరా! తాల్చితివందు మించుగఁ గళాపాండిత్యమానౌనన్ 41

మ. కలయన్ సంధ్యలు గ్రుంకువేళలఁ గదా! కాంతుల్
తమిం గాంతలన్
గలయంగాఁ గమకింతురెందు నిపు డుత్కంఠాతిరేకంబులన్

వెలుఁగంబారఁగ దిక్కులెల్ల రభసావేశంబునన్ వచ్చితీ
తలఁపుల్ వింతలు చక్రవాకములచేతన్ నేర్చితో వల్లభా! 42

మ. తెలివింజెందెను దిక్కులెల్ల నతిసందీప్తంబులై దీర్ఘికా
జలజంబుల్ వికసిల్లె కంటె జలజాక్షా! నీదు వీక్షాంబుజం
బుల నిద్రాలసభావముల్ చెలఁగ నేమోయంచు నీవెంచకా
కలకంఠీమణి మోముచందురుని చక్కంజూచు నుత్కర్షముల్

క. వనితామణి యివ్విధమునఁ
దనుఁగనుఁగొని హేతుగర్భితముఁగాఁ బలుకన్
విని చతుర వచన రచనల
ననునయపరుఁ డగుచుఁ బలికె నట హరియంతన్. 44

మ. వెనరుల్ పుట్టెడి మాటలాడి యలివేణీ! సోపచారంబుగా
మినుకుల్ పుట్టఁగ మాటలాడె దిపుడేమీ? తేటకన్గోనలన్
వినయంబుల్ కనుపించఁ జూచెదవు నీవే వేఱుగావింతువా?
విను!నాపట్లను తప్పుకల్గినను రావే! శిక్ష గావింపవే? 45

చ. కలువలు నీకటాక్షములఁ గల్గిన నేర్పులొకింత నేర్పుటన్
ములుకులుచేసి వాటిగొని మోహనవిద్యలనేర్చి మారుఁడో
యలికులవేణి! నీవలకటాక్షములం దయసేయు మిప్పుడా
కలువలగర్వమున్ మరునిగర్వ మఖర్వముగా ఘటించెదన్. 46

సీ. అదలించవదియేమి? యాననద్యుతులచే
బింకంబు పూను జాబిల్లి నిపుడు
గద్దించవదియేమి? కమ్మనియూర్పుచే
వలగొను నల గంధవాహు నిపుడు

బెదరించవదియేమి? బెళకుచూపులచేత
దాటెడు మగతేంట్ల దాటు నిపుడు
నిరసించవదియేమి? నిద్దంపుమోవిచే
నిగనిగమను మావిచిగురు నిపుడు

గీ. కోకకుచ! నీవు నామీఁదఁ గోపముంచి
యూరకుండిన నింట నేనుండదరమె?
వాటివగలెన్న తొల్లింటి వలపునించి
మించికౌఁగిట నను గారవించరాదె? 47

మ. అలివేణీ! నను నీవు మన్ననలు సేయన్ నమ్మి యేపట్ల నీ
చెలులన్ వేఁడమి నీ వెఱుంగుదువె? నీచిత్తంబులో నిప్పుడీ
కలఁకల్ పుట్టెడివేళ చూచుకొని యేకార్యంబు బోధించిరో?
కలవే! యిట్టివి లోకమందు మరి యాఁగ:ముల్ విచారింపవే?

ఉ. వాడినమోముతోడ నెనవచ్చును చంద్రుఁడు సారసాక్షి! నీ
పీడినసోగపెన్నెరుల వెంటఁబడున్ సమదాళులంచు నేఁ
జూడఁగఁ జాల కావిధము సూచనఁ జేసితి నింతె మన్మథ
క్రీడలకన్న నీదు కిలికించిత మేమిటఁదక్కువయ్యెనే? 49

మ సుమనస్సాయకలోల చాపమద ఖర్జూతిర్జన ల్సేయునీ
బొమ పొల్పంబు తదీయబాణముల సొంపుల్ వంపు
వాల్ జూపులుం
బ్రమదాంభోనిధిఁ దేల్చె సౌఖ్యములనాపాదించె
నూహించఁగా
రమణీ! కోపము సేయునట్టి యుపకారం బెన్నఁగా శక్యమే? 50

సీ. కుటిలకుంతల! నీదుకురులు చిక్కులఁబడ్డ
దాఁటులువేయదె తేఁటిదాటు
కాంత! నీయూరుపు లింత వేఁడిమిగన్న
నామోదిగాదె మందానిలంబు
పడఁతి! నీవెన్నంటు జడను గాంచినఁజూచి
కేకలు వేయవే కేకులెల్ల
నింతి! నీనెమ్మొగ మించుక వాడిన
చాల మిన్నందదే చంద్రబింబ

గీ. మలుకవూనంగ నీవిప్పు డంబుజాక్షి!
విన్ననై యున్నవిట్టి నీవేళచూచి
గెలువ దమకించు నివియెల్లఁ గేలిసేసి
పగలు నీఁగుట యొక్కక్కపట్లఁగాదె! 51

గీ. అనుచుఁదా పల్కుపల్కుల కాత్మలోని
కలఁకఁ దేటిన చూపులఁ గమలనయన
యించుకించుక తనుఁజూచు టెఱిఁగి విభుఁడు
నిండువేడుక తోడ నానెలఁత నంత. 52

ఉ. చక్కని సిబ్బెపుం గులుకు జక్కవగుబ్బల నుబ్బుమీఱఁగా
నక్కననొక్కి చొక్కి దరహాసము మోమున నంకురింప వేఁ
జెక్కనఁ జెక్కుచేర్చి రతిచిన్నెల వన్నెల వాఁడిగోరులన్
నెక్కొన గ్రక్కునన్ గళలనెన్నెలవుల్ గరఁగించకాంతయున్

శా. సంభోగశ్రమబిందువుల్ ముఖవిధుస్వచ్ఛామృతస్యందమై
సంభావింపఁగ లోచనాబ్జములపజ్జన్ బెన్నెఱుల్ గుంపులై
యంభోజమ్ముల ప్రాలు తుమ్మెదల యొయ్యారంబు చాటింపఁగా
పుంభావంబున నాథుఁ దేల్చె పులకల్ పుంఖానుపుంఖంబుగన్.

సీ. మొలఁత పతియును సరి మేలు మేలనంగ
సంగములు నేడ్కతోడ నుప్పొంగుచుండ
రతుల వింతలచే నభిరతులు వెలయఁ
గూడి యానందవార్ధి నోలాడి రపుడు. 55

—: విరహోత్కంఠిత సుదంత :—

గీ. అంతశౌరియు విరహ దురంతమైన
యల సుదంతను గనుఁగొను నాసమదిని
చిగురులొత్తఁగ నెలదోఁట చెంతకరిగి.
యందునొక్క మనోహరమైన చోట 56

సీ. వీణాదివాద్య ప్రవీణతరాణించు
బ్రతిలేని రతనంపుఁ బ్రతిమలెల్ల
జాబిల్లి రాగోడ జాడలఁజాలుగా
బ్రతిబింబసంపద పరిఢవిల్ల
వాటిసమ్మోహన వాద్యస్వనంబులు
బ్రతిశబ్దసంగతిఁ బరగు నందు
మేళముల్ రెండు సమ్మేళమై కనుపించు
మించనియొక్కటి నెంచలేక

గీ. సమత మన్నించవలెనంచుఁ జాల నెంచి
మించు వేడుక నచట రమించు శౌరి
యపుడు శశికాంతమణిజాలకాంతరముల
నలసుదంతను గనుగొరు నట్టివేళ. 57

చ. కలువలబంతులుం జలువగందపుగిన్నెలు తాళవృంతముల్
తలిరులు పువ్వుటెత్తులును తామరతూడు లనంటిమోవులుం

వలిపెములున్ హిమాంబువుల వాసనగిండ్లను రే వెలుంగురా
చలువల పీఁటలుం గొని విచారముతో నుడిగంపు. చేడియల్

సీ. కథలు చెప్పెదమైనఁ గలికి! లేజవరాలి
కలవరింతలు మాన్పఁగాఁదరంబె?
కలపంబు పైఁజల్లఁగా నలందెదమైన
మదిరాక్షి! మైకాఁక మాన్పఁదరమె?
విరుల వీజనలచే వీచెదమైనను
నెలఁతయూర్పులఁ వేఁడినిలుపఁదరమె?
పసిఁడి యుయ్యాలనుంచి పాడెదమైనను
పడఁతి జాగరము సిల్పంగదరమె?

గీ. యవనిఁగలిగిన శిశిరవస్తువులు దెచ్చి
సవదరించెద ముపచార సరణులెల్ల
నెట్టివిధమున నమరునో? యీక్రమంబు
చెలియప్రాణంబు వలరాజుచేతిదింక. 59

సీ. ఉపమానములు లేవె! యుర్వి నెమ్మోముతో
జాబిల్లి నెంచఁ బ్రసంగమేమి?
సరివోల్పమరి లేవే? జగతి గన్నులకును
వెలిదమ్మిరేకులఁ దలఁపనేమి!
పోలికల్ మరి లేవె? భూమిలో బొమలకుఁ
జెఱకుసింగిణులఁ జర్చింపనేమి?
సవతుగా మరి లేవె? యవనిలో మోవికిఁ
దళుకుఁ గెంజిగురాకుఁ దడవనేమి?

గీ. చక్కఁదనమున శౌరికి సాటిలేరె
యించువిలుకానిఁ బోల్చి వర్ణించనెంచు
నెంచుఁ దమలోన నేరంబు లెంచుకొనుచుఁ
జెలులు శిశిరోపచారముల్ సేసిరెలమి. 60

ఆ. రాజగోపుఁడిచట రాజాస్యయచ్చట
నెటులఁగలుగు కూటమిరువురకును ?
వనితపాలఁగలిగి వలరాచవేలుపు
కన్నుఁదెఱచెనేని గల్గుశుభము. 61

సీ. కందుకుందునులేని కలువలచెలికాఁడు
గలిగిన చెలి మేనికాఁకదీఱు
నిత్యవికాసంబు నెగడుతమ్ములు సంభ
వించిన చెలి మేనివేఁడిదీఱు
పగలురేలొకరీతిఁ బరగువెన్నలతేట
చేకూర చెలి మేని సెకలు దీఱు
ననిశ మార్దవమున నలరెడు తలిరాకు
లొదవినం జెలిమేని యుడుకుదీఱు.

గీ. ననినఁజెలులార ! యిట్టివి యెందుజగతి
నతనిసమ్ముఖ మతని హస్తావలంబ
మతనిదరహాస మాతనియంఘ్రిసేవ
గలిగి నప్పుడె యివియెల్లఁగలుగుఁ జెలికి. 62

క. అనిపలుకు చెలులఁ గనుగొని
కనుగొనలఁ వేఁడి తేటకన్నీరొలుకన్
వనజానన యిట్లనియెను
మనమున సంతాపభరము మల్లడిగొనఁగన్. 63

చ. ఫలకమునందు వ్రాసి తమప్రాణవిభుం బలుమారు వేడుచున్
బలపల వేగునంతకు నపారవియోగభరార్తలైన యా
నెలఁతలచెంత నవ్విభుఁడె నెమ్మది నమ్మదమంద నిల్చినన్
లలనరో! వారి వేడుక కొలంకులు నిండి తొలంకకుండునే? 64

మ. వెలలేనట్టి పదాంగదంబు చెలఁగన్ వింతల్ భళీ! మేలనం
దళుకున్ వల్లువ గొప్పముత్తియపుటందంబొప్పు బాహాంగదం
బులు రాణింపఁగ ముత్తెపున్ సరపణుల్ ముంజేతులన్
మించఁగా
సొలపుల్ మీఱఁగ వాఁడువచ్చి కనుమెచ్చుల్ సేయఁ
డేమందునే? 65

సీ. ఏలలువాడుచో నిపుడేటికో? చంద
మామమీఁది పదాలు మానినార
లధికంబుగాఁగూర్చి రది యేమొ? పన్నీరుఁ
గర్పూరమును జవ్వాగంధమునను
సన్నజాదు లిదేమొ యిన్నాళ్లవలెగాదు
పాన్పుపైఁ దఱచుగాఁ బఱచినారు
చేఁబూనుటయె కాక చెలువలు నేఁడేమొ
కీరశారికలఁ బల్కించలేదు

గీ. వెలి విసరినటు లున్నదీ విరహచిహ్న
మింతి! నీచెంత కాయన యిపుడె వచ్చు
ననెడు నీమాటలకుఁ జాలనలరి యుంటి
నింత తామసమాట యే నెఱుఁగనకట! 66

క. కలఁగన్న మేలుకొన్నను
కళవళమునసైన వాని గాంచియు మఱియున్
పలుమరు కనుఁగొనఁ గోరెద
మెలతరో! మరి యాస కెందు మేరలుగలవే? 67

మ. పదియార్వన్నెపసిండికి న్నెఱుఁగురాఁ బై జాదుఁగావించు న
ల్లైదపై కుంకుమమీఁద హేమకసనాహీనప్రభల్ బర్వఁగా
మదనాగేంద్రము లీల వచ్చు విభు మర్మంబుల్ విలోకించినన్
మదనావేశముతోడ నెవ్వతె కళామర్మంబు లూటడవే? 68

సీ. మొగముచూడక మాఱుమొగము వెట్టుదమన్న
నతనిఁగ్రమ్మరఁజూడ నాసయగును
చెలులతో నేమైనఁ బలుకఁబోయెదనన్న
నతని పేరేమాట లంమదొరలు
నలుకయూయనమీఁద నిలిపెదనన్ననుఁ
బ్రమదంబు తనుదానె పల్లవించు
తలఁపులో నాతనిఁ దలఁపకుండెదనన్న
నతని మీఁదిదెబాళి యగుచునుండు

గీ. నతనిపై నేరముల నెన్న నట్టివేళ
నతని సద్గుణగణములే యాత్మఁదోచు
మమత లిటువంటి వతనికి మరులుకొంటి
తామసించిన యింక నే దాళఁజాల? 69

గీ. ఎన్నివిధములఁ బలికిన నెఱుఁగనైతి
వింత నామేనిసంతాప మింత మేన
ననుచు చెలిదూరి వలవంత నాసుదంత
కంతుమందాని లేందులఁ గనలిపలికె. 70

శా. నవ్వుల్ శారదచంద్రచంద్రికలుగా నమ్మించి యాచంద్రికల్
పువ్వుల్ గా సవరించి వాటివెసనమ్ముల్ సేసి యా యమ్ములన్
మవ్వంబుల్ జతగూర్చునంచుఁ దుద నా మర్మంబు నాఁటింపుచున్
చివ్వల్ సేసెద వింద్రజాలము లెకా! చింతింప నీవైఖరుల్ 71

మ. అలరుంజప్పర మీలతావలయ మాహా! మెచ్చుపుట్టించె నిం
దలఁపుల్ దీరెదనంచు నెంచి యిటుడాయన్ బోయచందంబునన్
వలలో బోనునఁజిక్కునట్టు లకటా! వంచించి వేఁటాడె దీ
కులుకుంగుబ్బెత లందెకా మదన! నీకోదండపాండిత్యముల్.

సీ. పక్షపాతమునచ్చి పరభృతమ్ములమెచ్చి
కంటికింపైన చెంగావు లొసఁగి
మాటవాసులగొల్చి మనినఁజిల్కలఁబిల్చి
మేలిమివహి పచ్చడాలొసంగి
తగునడకలకెల్లయగు నంచలకునెల్ల
బహుమతిపద్మాల పట్టులొసఁగి
వడిగలతనమెంచి వరుసదేంట్లకుఁబంచి
వేర్వేరసేవంతి విరులొసంగి

గీ. చెలికుసింగణిఁ జెంగల్వచిలుకుదొడిగి
పంచసాయక! నను గుఱిపఱిచితీవు
చులుకుచూపిన హరుచూపు సూడమఱచి
మించి యబలలపై విక్రమించె దార! 73

శా. స్వాహాప్రాణసహాయకీలములకున్ సాహాయ్యముం జేసి యా
మాహామోహానవేషభూషలకు సంపాదించి సంజీవనం
బాహా! మంథరగంధవాహపథికప్రాణాపహస్వాంత! భూ
వాహంబైతివె యింక నెక్కడిది నిర్వాహంబు పాంథాళికిన్?

మ. పలుమాఱు న్నినునమ్మియుండ నకటా! ప్రాణంబు ప్రాణంబులై
కలయన్ మోహనచూర్ణముం జిలికి చొక్కంజేసి గూఢంబుగా
లలనల్ దాఁచినయట్టి మానధనమెల్లన్ పొంచి లాగించితౌ
తలఁపన్మందసమీర! లేదుగద నీదాక్షిణ్య మీపట్టునన్. 75

శా. చంద్రాపూరితచంద్రకాంతఫలకస్వచ్ఛప్రఘాణంబులన్
సాంద్రానందరసాతిరేకములు హెచ్చన్నిల్వ నెమ్మేన ని
స్తంద్రంబై కనుపించె తాప మకటా! దైవంబు రోషించి యో
చంద్రా! చంద్రసమాఖ్యఁగల్గునెడలన్ సంతాపముల్ గూర్చునే! 76

క. రామామణు లెటులోర్తురు
రామా! యీసెకలు చెల్లు రారాఁపులకున్
మామాయని వారింపఁగ
మామాటలు వినవు చందమామా! చలమా! 77

మ. రమణీలోకము నెల్లనేఁపుచును మేరల్ మీఱి వర్తిల్లఁగాఁ
గమలాకాంతసహోదరుండయిన చక్కం జూడరాదంచుఁ దాఁ
గమలాగారదళారరమ్ములను నేగంగప్పు నీరాకకీ
యమితంబైన కళంక మేమిటను పాయంజాలు దోషాకరా!78

కం. అలుక నిటు లింతిమన్మథ
మలయానిల తుహినకరుల మాటికిఁ దెగడన్
చెలిచూచి పలికె నేర్పున
పలుకుల నెన రుట్టిపడఁగఁ బ్రమదముతోడన్ 79

చ. కలికిరో! నీదు చిత్తమెఱుఁగన్మదినెంచి ముదంబుతోడ నీ
చెలువుఁడు కేళికావనము చెంగటి బంగరుమేడలోన నీ
పలుకులువించు కోరికలు పల్లవితంబులుగాఁగ నున్నవాఁ
డెలమినటన్న నన్నెలఁత హెచ్చిన సిగ్గున మోమువాంచినన్.

గీ. అపుడు కనుసన్నచేఁ బిల్వ నామురారి
వనితచెంతకు వేడుకవచ్చినిల్వ
నలరుబెత్తులు తెచ్చెద ననుచునొక్క-
పనినెపంబున నేఁగినఁ బ్రౌఢదూతి. 81

శా. ఆనందాతిశయంబుమించు నొకసయ్యాటంబుచే నొయ్యనన్
నానల్వాని మొగంబువాంచినను నన్నాళీకపత్రేక్షణన్
నానానూనమనోజశాస్త్రకలనానర్మక్రియానైపుణిన్
దేనెల్చిందెడు పువ్వుటింటి మణివేదిన్ నేరుపుల్ మీఱఁగన్.

ఉ. ఉల్లముపల్లవించు సరసోక్తుల లేనగ వుల్లసిల్లఁగాఁ
బల్లవశయ్యపై సరసభావము మీఱఁగ నిండుఁగౌఁగిటన్
హల్లకపాణిఁజేర్చి మనసారఁగ పల్కెడు కుల్కుపల్కులన్
ఝల్లన మేనిపై పులకజాలము నిండఁగ నిండువేడుకన్. 83

చ. విడుమరలేని జెయ్వులను వింతయొయారముచూపు చూపులన్
తడబడు మాటమాటు వగదంటతనమ్ములఁ వింతవింతలై
పొడమెడు భావబంధముల పొంగుచునున్న మనోరథమ్ములన్
బడఁతుకఁదేల్చె మాధవుఁ డపారవిలాసరసైకలోలుఁడై. 84

శా. అత్యారూఢవిలాసినీజన విలాసాధార! సాధారణ
ప్రత్యాదేశసదేశనప్రమవిహితాబ్రహ్మణ్య! బ్రహ్మణ్యతా

సత్యాపాదితసత్యవాఙ్ముఖ సుధీసత్రాస! సత్రాసగీ
ష్పత్యంతవిచారకృన్నయవిదా సంసార! సంసారతా! 85

క. వరుణాధితపుర కరుణా
కరుణాధిక కాంతిపూరకలితాభరణా
భరణార్థి వైరిశరణా
శరణాగత జయపయోధిజా సంవరణా! 86

స్రగ్విణి. భావభూశోభిశోభా ప్రభావోపమా
భూవిభా వైభవా భూష్ణు భూమోద్భవా!
భావిభూతోద్భవద్భవ్యవద్భూమిభృ
ద్భావుకోద్భావి పద్మాభవప్రాభవా! 87

క. అతిభీతి వినతవిమత
క్షితిపాలకతిలకసతత సేవితసదనా!
చతురానన చతురవధూ
శ్రితవదనా 'ముద్దుచంద్రరేఖా' మదనా! 88

గద్య. ఇతి శ్రీమత్కాళహస్తీశ్వర కరుణా కటాక్షలబ్ధ సిద్ధసార
స్వతనయ చెంగల్వవేంకటార్యతనయ విజయరాఘవభూప
ప్రసాదాసాదితరాజచిహ్నచిహ్నితభాగధేయ కాళయనామ
ధేయప్రణీతంబైన రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబు
నందుఁ దృతీయాశ్వాసము. 89



శ్రీరస్తు.

# శ్రీ రాజగోపాలవిలాసము

## చతుర్థాశ్వాసము.

శ్రీపదనిజపదసేవక
సేవాళక్షితిప శత్రునిగ్రహ జాగ్రత్
ద్వీపాంతర శుభవిభవ
ప్రాపకజయహారి! విజయరాఘవశౌరి! 1

గీ. అవధరింపుము సూతసంయమివరుండు
శౌనకుని తోడ నిట్లను శౌరియట్లు
వెలయ జాంబవతీ మిత్రవిందలను సు
దంతఁ దేలించి కాంతలఁ దలఁచి మఱియు. 2

—: ప్రోషితభర్తృక-కాళింది :—

సీ. పార్శ్వభాగాభోగ పరిలక్ష్యమార్తిక
ప్రభలు చామరముల రహివహింప
పరిసర పరిచరాంచద్భర్మ పాలిక
లుడిగంపు చెలువల యొఱపు నెఱప
కనకపంజర కీరకలితగీ రచనలు
సాహోనినాదమ్ము సవదరింప
దివ్యమణీగణ దీవ్యద్విభాశ్రేణి
కరదీపకలికల కరణిఁ దనర

గీ. గుంభితమయూఖ ఘనశాతకుంభకుంభ
భానునిర్యత్న నిర్యత్ప్రభానుభావ
మనఁగ పీతాంబరద్యుతు లమరనుండి
రాజగోపాలుఁ డొక సౌధరాజమందు. 3

క. ముందుగ ప్రోషితభర్తృక
యందం బరయంగ దూతి నంపితినని గో
విందుఁడు కాళిందీసతి
చందం బరయంగనున్న సమయమునందున్. 4

గీ. తామరసనేత్రుఁ డొకయింత తామసింప
నొక్క నిమిషంబు యుగముగా నూహసేయు
నట్టి కాళింది తన పార్శ్వమందునున్న
ప్రాణసఖ తోడ నిట్లని పల్కెనపుడు. 5

ఉ. వద్దికివచ్చు నాథుఁడను వార్తలు నీవన నమ్మియుండి యే
నద్దమరేయిదాఁక నడియాసల నాతని రాకఁగోరఁగా
ప్రొద్దునువోయె నన్ను మరి ప్రోషితభర్తృకఁగా నొనర్చి యే
గద్దరిసుద్దులెంచి వడిగాఁ జనెనో హరి గొల్లపల్లెకున్ ? 6

శా. వాడల్ వాడలనుండి మన్మథకథావ్యాపారముల్ మీఱఁగా
వ్రీడాభారమునన్ బిగించి కడు నువ్విల్లూరు డెందంబులన్
క్రీడాసౌధములెక్కి యొక్కమొగి సంకీర్ణంబుగా దేవతా
చూడారత్నముఁ జూతు రంబుజముఖుల్ సొంపుల్
పిసాళింపఁగన్. 7

చ. పలుకులఁ దెచ్చుకోల్వలపు పైఁబచరించుచు వింతవింతలా
కులుకుల లేనిమచ్చికలఁ గూర్చుచుఁ గైతవనర్మమర్మముల్
సొలపులఁజూపు జంతలకుఁ జొక్కుదు రింతయుకాక గట్టిగా
వలచిన వారిపట్ల మగవారల కెక్కడిమోహమక్కటా! 8

ఉ. ఎన్నడువచ్చు వీథికడ కెన్నడుచూతము సొంపుమీఱఁగా
నెన్నడు మా మనోరథము లెల్ల ఫలించు నటంచు వానికై

క్రొన్నన వింటివేలుపును క్రొన్ననలం దగఁ బూజసేయు నా
కన్నెలు సేయుభాగ్యములు కామిని! నేడుఫలించెనే కదా! 9

ఉ. వెక్కసమైనమోహమున వేమరు నాతని దూరనేలనో
చక్కెరబొమ్మ! యింకిట విచారము లేటికి? నోంటిపాటుగా
నక్కట! యెవ్వతైన మనసారఁగ నవ్విభు నిందుఁగాఁగిటం
జొక్కఁగఁ జేసి వేఱొకతె జూడఁగనిచ్చునె? వాఁడువచ్చునే? 10

సీ. ఆజానులంబిబాహార్గళంబులవాఁడు
శైలశృంగోన్నతాంసములవాఁడు
శారద విధుబింబచారు వక్త్రమువాఁడు
ధవళాబ్జమిత్ర నేత్రములవాఁడు
కనక కవాటికా కఠినవక్షమువాఁడు
కంబులక్షణలక్ష్య గళమువాఁడు
భాగ్యరేఖాంకిత పాదపద్మమువాఁడు
తరుణప్రవాళ హస్తములవాఁడు

గీ. వానిఁజొక్కించి కౌఁగిట వలపునించి
ముచ్చటలు మీఱ మనసార మోవియాని
ముద్దువెట్టుక సొలపుల ముంచివేడ్క
మరులుకొలుపక విడుతురా మానవతులు. 11

ఉ. ఊరికిఁ బోయివత్తునని యూరటసేయక నిర్దయాత్ముఁడై
యారడిఁబెట్టి ప్రాణవిభుఁ డాతనియొద్దికి దూతినెట్లు నే
నూరికినూరు బొమ్మనుదు నోంటిగఁ బొమ్మనకున్న నక్కటా!
యూరక యుండరాదనుచు నుల్లమునం బరితాపమొందుచున్,

గీ. అటులకాళింది మదనదురంతవిశిఖ
సంతతాసారజాతవిచారయగుట
సనుఁగు నెచ్చెలి కనుఁగొని యధిపురాక
యరసివచ్చెదనని తెల్పి యరగునపుడు. 13

క. చెలువుఁడు దేశాంతరమున
నిలిచెను నెచ్చెలులు పోవనేర్తురె ? యటకున్
చిలుకలె వలంతులని తన
చిలుకం గాళింది ముద్దుచిలుకం బలికెన్. 14

మ. చిలుకా! పల్కవదేమి? నీకు నలుకా! చింతాసముద్రాంబువుల్
తలమున్కల్ సవరింప తేపవగుచుం దాపంబువారింపవే
తొలుతన్నీవొనరించు మన్మథకథామాహాత్మ్యంబునన్ బ్రాణముల్
నిలువంజేసితి నీమహామహిమ వర్ణింపంగ నే నేర్తునే? 15

ఉ. తెక్కలుదువ్వి నీయెదనెఱింగి మెఱుంగుకడాని గిన్నెలో
చక్కెరమేపి యేఫలరసంబులు గ్రోలఁగనిచ్చి పావడన్
ముక్కున జిడ్డువోఁదుడిచి ముద్దిడి వేఁడెదఁ గాంతుఁడున్న యా
దిక్కున కేఁగి యోచిలుక! తెల్పఁగదే వలిదేనె చిల్కఁగన్. 16

మ. తొలుదొల్తం గుసుమాస్త్రశాస్త్రమతమాహాత్మ్యంబునం బ్రోడవై
పొలయల్కల్ వొలయంగ దంపతులకున్ బోధించి సంయోగముల్
గలుగంజేసిన నీమహామహిమ విఖ్యాతంబు లోకంబునన్
జిలుకా! నా పలుకాదరించి పతికిం జిత్తంబురాఁ దెల్పవే! 17

గీ. అనుచుఁ బలికెడువేళ నయ్యంబుజాక్షు
మేని జవ్వాదిపస కదంబించ దిశల
నాయకునిరాక యరయఁగఁ బోయివచ్చు
ననుఁగునెచ్చెలి వల్కె నయ్యతివతోడ. 18

ఉ. హెచ్చెను దిగ్విభాగముల నెల్లెడ మేని జవాదివాసనల్
వచ్చెను నాథుఁ డీనగరి వాకిటికి న్నెఱరాజసంబుతో
మెచ్చవె యింకనైన మెరమెచ్చుల సుద్దులువల్కనెన్నదుర్
పచ్చనవింటివేల్పునకు భామిని! జాతరసేయు మింకిటన్. 19

గీ. అనుచుఁ బలికెడువేళ కంసాసురారి
మందహాసంబు చెక్కులఁ గందళింప
వలిపె వలిదుప్పటీ వలెవాటుతోడ
మెల్లమెల్లనె చెలియున్న మేడఁజేరి. 20

మ. కలవీణారణనాంకకంకణగణ క్వాణంబు రాణింపఁగా
కులుకుంజన్నుల సాలుపైయ్యెదల కొంగుల్ జాఱు
నొయ్యారముల్
మొలవంజూచు మిటారిచూపులను సొంపుల్ నింపుచున్
గుంపులై
కలకంఠుల్ రతనంపుటారతు లొసంగంజూచి యుప్పొంగుచున్.

గీ. రాజసముమీఱఁ గక్ష్యాంతరములు గడచి
విరహాతురయై యున్న వెలఁదిఁజూచి
చిలికిచూపుల వలపులు చిగురులొత్తఁ
బలికెఁ బలుకులఁ గపురంపుఁబలుకు లొలుక. 22

మ. జలజాతాయతనేత్రి! యేనొక నిమేషంబైన నిం జూడకే
నిలువన్నేర్తునే? యెట్లుదోఁచె మది సందేహంబు నావల్లనే
తలఁపుల్ లేవని కిట్లు ప్రాపితసతీధర్మంబు వాటించి లో
దలఁకంగా నిపు డేటికంచు హరి యత్యంతానురాగంబునన్.

క. అని యీరీతిని బలుకుల
నెనరులు చిలుకుచును మానినీమణి హృదయం
బనురాగంబునఁ దేల్చుచు
మనసిజసందీప్యమాన మానసుఁడగుచున్. 24

చ. నిలుపఁగరానిమోహమున నీరజలోచనఁ జేర్చి కౌఁగిటన్
చలువలుగుల్కు క్రొవ్విరుల శయ్యకు నొయ్యనఁదార్చి తేనియల్
చిలికెడు మోవి పల్మొనలచేఁ గసిగాటులుసేసి వీనులం
జిలిబిలిముద్దుబల్కులనుఁ జేర్పుచు నేర్పులు పల్లవింపఁగన్. 25

క. వరరాచకేళిఁ దేలిరి
చెలువయు చెలువుండు వింత చెలువము మీఱన్
కలరవ గళరవములకుం
గలరవములు మెచ్చ పొగడఁగా నవ్వేళన్. 26

—: స్వాధీనపతిక-సత్యభామ :—

సీ. బటువు గుబ్బలమీఁది పయ్యంట లరజార
రమణులు మణి చామరములు వీవ
తారహారంబులు పేరెముల్ వారంగ
వనితలు వలిపెపావడలువైవ

చెక్కులగమ్మడాల్ చిందులుద్రాక్కలంగ
　　పంకజాక్షులు బరాబరులు సేయ
పాణిపద్మప్రభల్ పల్లటీల్ గొనచెంత
　　హరిణనేత్రలు కొనియాడుచుండ

గీ. రాజసంబున పూర్ణిమా రాజవదన
సత్య గొలువుండ నపుడు నాసత్యమూర్తి
వినయ మీరీతి మూర్తిభవించె ననఁగ
వెన్నుఁ డరుదెంచె దూతిక వెంటనెలమి. 27

క. వచ్చినమాధవుఁ గనుగొని
నెచ్చెలు లందరును మానినీమణి! విభుఁడే
వచ్చెనిదె నీదు నగరికి
నిచ్చలవిడి ననిన నిండువేడుకతోడన్. 28

మ. పులకల్ గుబ్బలమీఁద జాదుకొనఁగా పుంఖాను పుంఖంబులై
బెళకుం గొ నసియాడ ముద్దులనడల్ బింకంబు బొంకింపఁగా
తలఁపుల్ మీటఁగ హెచ్చుకోర్కులొక చెంతల్ బిట్టు
　　　　　　　　　　　　　　　　　గెర్లాడఁగాఁ
దళుకుంజూపులఁ జూచె భామ విభు నుద్దామప్రమోదంబునన్.

గీ. చూచి యెదురుగవచ్చి యాశోభనాంగి
రమణు కైదండ గైకొని రాజసమున
మెల్ల మెల్లన కెంపురా మేడపొంత
వింతయైనట్టి మణివేది చెంతకరిగి. 30

చ. చిలుకలు వింతలౌకతలు చెప్పఁగ నొప్పఁగ వాటినన్నిటిన్
బలుమరు నారజంపువగ పారువముల్ మదిమెచ్చి మచ్చికన్

జెలఁగి నుతించునందములు చెల్వాలరం గలనాదవైఖరుల్
కెలఁకులనించు నించుజవికెఁ నవకంబగు పువ్వుబాన్పునన్. 31

గీ. ప్రాణనాథుండు దాను ను ప్రౌఢిమెఱయ
నందు గూర్చుండి యుడిగంపుటిందుముఖులు
చిత్తమలరంగ సేవలు సేయుచుండఁ
బ్రమదమునబల్కె విభుఁజూచి ప్రమద యవుడు. 32

మ. తలఁతే మున్నొకనాఁడు నెచ్చెలులు చెంతంజేరిమాటాడఁగా
నెలరా మిన్నల తిన్నెనుండి బయటన్ నిద్దంపు లేవెన్నెలన్
నెలవంకన్ సవరించి నెన్నొసటిపై నెమ్మిన్ సరోజాక్షు! నా
కళుకుం జెక్కిలినొక్కి యొక్కనెలవంకన్ నెక్కొనం
జేయుటల్. 33

శా. లీలామన్మథ! నేఁడు నీతలఁపులో లేదా? రహస్యంబుగా
కాళిందీపటకుంజపుంజముల వేడ్కల్ మించఁ గ్రీడించఁగా
హాళిందేఁటులు నాకటాక్షములచాయన్ డాయఁగా నీవు చే
నాళీకంబునఁ జోఁపఁ దావికవి చెంతంజేర నేనవ్వుటల్. 34

మ. కలకంఠీమణు లొక్కనాఁడు నను శృంగారింపఁగాఁ జూచివా
రలవారింపుచు నేర్పుమీఱ కొనగోరన్ పెన్నెరుల్ దువ్వి నీ
వలరుందండలు గొప్పనందురుము నొయ్యారంబు లేమెచ్చనా
తలిరున్ వాతెఱ మెచ్చుగానడుగు చందంబందమై యుండెగా.

శా. నెత్తంబాడిన పందెమిమ్మనుచు నే నీకౌస్తుభంబంటఁగా
హత్తెన్ నాకొనగోరు నీయురమునందా మంచిదే యంచు నా
గుత్తంపున్ వలిగుబ్బిగుబ్బలపయిన్ గోరుంచి లాలించి నా
చిత్తంబుం గలఁగించుటల్ మఱతువా? శృంగారలీలానిధీ! 36

గీ. అనుచుఁ బలికిన మాధవుఁ డనియెనపుడు
నిష్కళంకమృగాంకాస్య! నెమ్మనమున
నిపుడు తొల్లింటి మచ్చిక లెంచుటెల్ల
నమర మదిసేవ సేయుమిా వనుటగాదె. 37

శా. బాలేందూపమఫాల! యేలయిఁక నీభావాలి సంగోపనం
బేలీలన్ విహరింప నీవు మదిలో నేలాగు చింతింతువో
యాలీలన్ సమకూర్చు వాఁడ భవదాయత్తంబు చిత్తంబు నీ
వేళల్ గాచుక సేవ సేయుటకునై వేమారు నేఁగోరుదున్. 38

చ. మలయజగంధి నేర్పునను మాధవుఁ డాడిన మాట కిట్లనున్
నళినదళాక్ష! యేనెఱుఁగ నా మది నాఁటిన ప్రేమనిట్లు వి
చ్చలవిడి నాకు దేమి యుపచార విశేషము శేషభామినీ
వలయము నెల్ల నీవు నెఱవంచన సేయుట నన్ను నెంచియే! 39

గీ. చిన్నిగోరున మున్ను నా చెక్కులందు
మకరికలు నీవు వ్రాయుట మదిఁదలంతు
కేళి నీ జానిరూపునం గెలిసేసి
డాలుగై కొన్న బిరుదంపు వ్రాలుగాఁగ. 40

చ. అనియిటువారు వల్కుసమయంబున నా ప్రసఖీజనంబు తాఁ
జనియెను వేఱువేఱ నుపచారముఁ గూరుచుకై తవంబునన్
వనజదళాక్షుఁడున్ సతియు వైభవమొప్పఁగ వింతవింతగా
బెనఁకువమాట నేర్పు నడిపించిరి యుల్లము పల్లవింపఁగన్. 41

మ. మలయక్షోణిధరాగ్రశృంగములఁ బ్రేమంజూడఁగా నెమ్మదిన్
గలికీ! వేడుకలయ్యెనంచుఁ బలుకంగా నేల? గందంబునా

కులుకఁ వ్రేటువగబ్బి గుబ్బలపయిం గూర్పంగ నీనేర్పునే
తెలియఁ లేనొకొ నీదువంచనకు వ్రేతెంగాను గోపాలకా! 42

సీ. చిలుకపల్కుల ముద్దుచిల్కుట చూతమా?
యైతువవ్యవహారమమరకెట్లు ?
కలికి! జక్కవకవల్ కలయిక చూతమా?
యరుణగంధంబు పైనలమకెట్లు?
కలకంఠరవము లాకర్ణించ చూతమా?
యిగురుమోవుల మేఁత లియ్యకెట్లు?
నెమ్మలుపురివిచ్చు నేర్పులు చూతమా?
యుపరిఘనస్ఫూర్తి యొదవకెట్లు?

గీ. లమృతములఁచిల్క విధుఁజూచు నద్దమెట్టు
లిందుకిది యుత్తరంబని యెఱుఁగ నిపుఁడు
తేలుతఁబలికిన వాటికి తోడుతోడ
హరువులోనఁగూర్చి సుఖముల ననుభవింపు. 43

మ. తలిరున్ మోవులు నొక్కినొక్కకడు నుద్దామప్రమోదంబునన్
గలకంఠుల్ కలకంఠరావముల జోకల్ జూప వేడ్కల్ చెలీ!
కలకంఠాళియు నల్లెవర్తిలఁగ నౌఁగాదన్న వారెవ్వ రీ
తలఁపుల్ రూపవిలాసపోషితవసంతా! నీకు చేకూడవా.! 44

మ. జలజాక్షీ! విను చందమామకు సుధాస్యందంబు లందంబులై
చెలఁగంజూడఁగ వేడుకయ్యెడిని నీచిత్తంబునన్ లేదకో
జలజాక్షా! జలధిఁ మధింపఁగ సుధాస్యందంబు లందంబులై
చెలఁగం చందురునందు నింతయువి వాసిన్ మించ
నేనెంచెదఁ. 45

గీ. అనుచువారలు మాటల ననుచు వేడ్క
గాఢపరిరంభ సంభ్రమ కౌశలముల
వినిమయ కృతాధరాస్వాద విభ్రమముల
కలిత కిలికించితమ్ముల గలసిరపుడు. 46

చ. కలిగె సమానురాగములు గల్గిన వీరికి నేఁడుకూటముల్
నెలకొనె నాదుకీర్తులని నెమ్మది వేడుక పంచసాయకుం
డలరులసోన నించెనన నయ్యలికుంతల కుంతలంబులన్
జలజలరాలె పూలు సుమసాయక సంగర కౌశలంబునన్. 47

మ. తళుకుంజూపుల వెంబడించిన యలంతల్ వింత లేనవ్వులం
గలయంబర్విన కమ్మవీడియపుచెంగావుల్ దువాళించఁగా
వలపున్ సంపంగిదండవోలె వసివాళ్వాడం దనూవల్లి యా
నలినాక్షీమణి చూడనొప్పె హరి యానందాబ్ధినోలాడఁగన్.

గీ. అంతశశిజాతె తిమిరంబు లడఁగఁబాతె
కువలయంబులు వాఁడి జక్కవలుకూడి
దెసలు తెలివొందె విరహుల దెసలుడిందె
తపనుఁ డుదయించె సాంధ్యకృత్యములు మించె 49

క. చతురానన ముఖులందఱు
నతులొనరింపంగ దక్షిణద్వారకలో
క్షితిలక్ష్మీనీళాదులు
కుతుకంబునఁ గొల్వరాజ గోపకుఁడుండెన్. 50

ద్వారకావర్ణన.

గీ. వాసుదేవుని సంతతావాసమునను
భాగ్యములకెల్ల నెల్లయై పరగునట్టి

తన్నివాసంబు మహిమ యే ధన్యమతిని
తెలిపెదను నీకు మునిలోకతిలక! వినుము. 51

సీ. శ్రీధరావీక్షణ శ్రీధరామ్రేడిత
కమలతోరణదామకవచితంబు
ప్రత్యూషశ్రుతిపాఠ పరధరామరసుత
సహపాఠి శౌరికా సముదయంబు
ప్రతిమాస కల్పితప్రతి ముహూర్తారబ్ధ
రాజగోపోత్సవరాజితంబు
కనకగోపుర రత్నకలశనక్తందివ
నాటితామిత సూర్యనాటకంబు

గీ. కీర్తనీయనికేతన కేతనాగ్ర
పక్షిరాజహిరణ్మయ పక్షవితత
విద్యుదంశుసముద్ద్యోత వితతతమము
దక్షిణద్వారకా పురోత్తమము దనరు. 52

మ. అలనీలాలక లందు రత్నమయగేహద్వారబంధారర
మ్ముల పొందమ్ములయందుఁ దేటిగమి సొంపుల్ నింపు
నాత్మీయచం
చలవీక్షాంచలపాళి కుల్కఁగని యిచ్చన్ నవ్వుచున్నట్టిచి
ల్కల శిక్షింతురుపల్కుటందముల జోకల్ నేర్పునేర్పుల్ తగన్.

మ. తలఁపన్ వేలకొలందులై తనరు కాంతారత్నముల్ మేనిపైఁ
గలయన్నించిన మన్మథాంకము లెసంగ న్నాథుఁడే తేరఁగా
లలనల్ కన్నులఁజూచి యుండి మును నల్కల్ పూన
రుద్యుక్తుఁడై
వలరాయుండు ధనుర్ధరుండగుచు నిల్వన్ తద్గృహా
గ్రమ్ములన్. 54

మ. కరముల్ సాఁపుచు చూపిచెప్పఁగ మరుత్కాంతల్
జయంతాదులా
నరుదుల్ చూచితిమంచు మెచ్చి మదిలో హర్షింప
వైడూర్యముల్
తెఱలెత్తన్ మణిదీపముల్ చెలఁగ హాళిన్ జాళువామేడలన్
సొరిదిం గన్నెమెఱుంగు గుంపులు నటించున్ మెచ్చుగా
నచ్చటన్. 55

శా. తారామార్గముమీఱు సౌధగృహసంతానంబు పైబంగరుం
రారేకల్ నవసూన సౌరభములన్ రాణింప పొందమ్ములన్
బేరాసన్ సురసింధుపద్మములలో భృంగాళి యేతెంచి ఝుం
కారంబుల్ సవరించుఁ దన్మహిమకుం గైవారముల్ నాతగన్.

మ. తళుకుంగెంపులయండ నీలనికరధ్వాంతంబున గోకముల్
కలయంగా గమకించి పాయుటకునై కాంతామణుల్ నవ్వ నా
జిలుగున్ వెన్నెలఁ జంద్రకాంతవళభీ సీమల్ పయోధారలం
దలకొల్పంగఁ దదగ్రగేహ మమరున్ ధారాగృహం బోయనన్.

మ. వలువల్ కోరినయట్లు కల్పలతికావ్రాతంబొసంగన్ మరు
జ్జలజాతుల్ గయికోఁదలంచు నెడ నాసౌధాగ్రహీరప్రభల్
వలువల్ నాఁగఁ దదంతరాళములఁ బర్వన్ వాటిఁబూనంగ చే
తులుసాఁపం గని గొల్లున న్నగుదు రింతుల్ తద్గవాక్షమ్ములన్.

మ. రమణుండందరు వేరువేరను శరద్రాకాశశాంకాస్యలం
గ్రమముల్ మీఱఁగ నేలువైఖరులఁ దత్కాంతా
శిరోరత్నముల్
సమరాగంబున వానికిన్ వలచు నాసయ్యాటపుఁ నేర్పులం
దమిపుట్టించు నిలింపదంపతులకుం దచ్చిత్రలేఖాంకముల్. 59

శా. రాణింపన్ తుదసజ్జలన్ వెలిగుడారంబుల్ దిగంతంబులన్
నాణీయ స్తరకరత్నగుంభముల చాయల్ మోహరింపన్ శచీ
ప్రాణాధీశ్వరు సౌధముం గెలిచి తత్ప్రాసాదరాజంబు త
న్మాణిక్యంబులడాల్ హరించె భళి! సన్మానార్హ మానాననన్.

ఉ. మ్రొక్కుచు వేడుచుం గదిసి ముద్దిడుచున్ నును మోవి
నొక్కుచుం
జొక్కుచు గోపికల్ ప్రియునిఁ జొక్కఁగ జేయు విలాస
చిత్రముల్
చిక్కనిసిగ్గులం బ్రియునిచెంతలఁ జేరక చంద్రశాలలం
దొక్కెడఁజూచు నచ్చటి నవోఢల మూఢలఁ జేయునెంతయున్.

మ. వలభీప్రాంతమునందు కార్మొగిలు క్రేవన్ డాఁగుచున్
గ్రమ్మఱం
దళుకుల్ చూపుచు చంచలల్ మెలఁగుచందంబుల్ విలోకించి
వేడ్కలమీఱన్ హరినీలదీధితి తమస్కాండంబులో నచ్చటం
లలనల్ డాఁగిలిముచ్చులాడుదురు లీల నాథుఁ డుప్పొంగగన్

ఉ. ముక్కులఁ గెంపురాతళుకుమొక్కల మేటికిరీటి పచ్చరా
చెక్కలమించఁగా నదనెఱింగి మెలంగు మెఱుంగుబోడులం
జక్కెరవేడుచో నచట జాతి విజాతుల నేర్పరింతురా
చక్కెరబొమ్మలోవరుల చక్కని నిల్చిన చిల్కగుంపులన్. 63

మ. కరిదంతమ్ముల పువ్వుబోదె తుదసింగంబుల్ పిసాళింపఁగా
సరసంబెంపుడువేల్లు వాటిగని చాంచల్యంబుచేఁదాఁటి కా
తరసారంగవిలోచనా మణులచెంతన్ నిల్వ చెల్వొందు తా
నరయున్నచ్చట వీక్షణాంచలములం దాపమ్యమామేడలన్. 64

శా. చాలాపేడలఁ జంద్రకాంతజలనిష్యందంబు లవ్వేటిలో
లోలాక్షుల్ తమిఁజూచునప్పుడు తదాలోకానుషంగంబునన్
వాఁలారున్ మగవాలుగల్ గలుగుశేవంబర్వన్ గేహేందిరల్
మీలంచుల్ ధరియించునట్టి కరణిన్ మించున్నిశావేళలన్.

ఉ. వేడుకకాంద్రగూడి తటివెన్నెలరేలు మిటారికత్తియల్
మేడలమీఁదనుండి మెరమెచ్చులకై జతగూడిచల్లగాఁ
బాడెదు పాటమెచ్చి సురపాదపముల్ తలలూఁప రాలు న
వ్వాడనివువ్వు లెవ్వరను వాడనివారటలేరు చూడఁగన్. 66

ఉ. అల్లన చంద్రశాలల నొయారులు పౌరుష కేళిసల్పుచో
ఝల్లునరాలు ముత్యములు సౌరనదీకనకాంబుజంబులం
దెల్లనుఁబర్వ నంచగమి యింపలరం దమగ్రుడ్లటంచు మై
చల్లని రెక్కలంబొదువు చంచువులఁ బలుమారు దువ్వుచున్.

చ. జలకములాడి నున్నడుగు సాలియలూని ప్రియానురక్తికై
మలయజగంధు లప్పురము మాడువులన్ స్మరమంత్రవాదపుం
గలరవముల్ బయల్పరపఁగా విని నేర్చిన యందువల్లనే
కలరవనామధేయములు గల్గె జగంబునఁ బారువాలకున్. 68

చ. కులగుణరూపరేఖలనె కోరివరింతురు పల్లవావళిన్
వెలవెలఁదుల్ పసిండికయి వేడరు తక్కినవారినచ్చటన్
బెళుకుమెఱుంగురంగు నెఱబింకము సుంకము వెట్టుమేని క్రొం
దళుకులచేతఁ దాము సతతంబును పైఁడి వసంతమాడగన్.69

సీ. వెన్నెల లోక్కొక్క వేళగాని చెలంగ
వవియు నవ్వులకు నీడనఁగరాదు
కమలముల్ దినమందె కానియందముఁ జింద
నవియు మోములకు నీడనఁగరాదు

కలువపువ్వుల కేలుగాని నీటువహించ
వవియు చూపులకు నీడనఁగరాదు
తలిరు లామనిగాని తలచూపగానేర
వవియు మోవులకు నీడనఁగరాదు

గీ. మేలి తనసాధనమ్ముల మించి వీట
వెలవెలందులయెడ వింటి విభవమనుచు
సతనుఁ డడిదమ్ములుగ వారి నర్చసేయు
టనుమితంబగు గంధమాల్యాదికముల. 70

మ. శరవేగమ్ముల నాత్మవేగములు మించన్ వేగమున్నాడి మీ
కరవల్లత్కరవాళముల్ విమతపక్షంబుల్ విభాళించఁగా
శరసంధానములేల మీకు ననువై సాదిప్రజామాళితో
పురిలో వాహాపరంపరల్ చలతరప్రోథంబుగా హేషలక్ 71

చ. జలదములం బ్రతిద్విరదశంకను కొమ్ములగ్రుచ్చి చిమ్మఁగా
వెలువడు తద్గతాశనుల వేఁడిమి కోర్చిన వారనాళికిం
బలిమిగ నగ్నియంత్రముల బన్నరపన్ వలదంద్రు వీట యం
తలు రణమన్నపట్ల మదధారలు చిందగ నింతయేఁటికిన్. 72

సీ. బటువుసిబ్బెపు గుబ్బపాలిండ్లపేరిటి
గట్టులపైనునికి పట్టుసేసి
గప్పుచిప్పిలు గొప్పకొప్పులపేరిటి
చీకటిపొదరిండ్ల చెంతనిలిచి
కనుచూపుమేరకు గనరాని నడుముల
పేరి యెడారుల దారినుండు
జిలుగుఁజాయల వాఁడిచికిలిచూపులపేరి
ఛిలుకటమ్ములుకొన్ని చిలికిచిలికి

గీ. వంచననుఁబొంచి తను గానుపించకుండ
సతులచేతనె పురిచెంత సతులమహిమ
నర్థ్యగుల మానధనముల నపహరించు
వించి విలుపాళిగాని వర్ణించదరమె? 73

చ. పలుమొనకెంపుగుంపు పయిపై నిగుడం జిగురాకు మోవులం
గలసిమెలంగునట్టి గణికావిటపాళుల కేళిచూచి యో
పలుమొనకెంపుగుంపు పయిపై నిగుడం జిగురాకుమోవులం
గలిసిమెలంగు వీట గణికావిటపాళి వనాంతరంబులన్. 74

సీ. విప్పారు చెంగల్వవిరు లమర్చినయట్టి
యద్దంబు మేలుమే లనఁగవలయు
తెలిమొల్ల మొగ్గలు దినుసేర్చికూర్చిన
మగటిమి హెచ్చని పొగడవలయు
పసిఁడి సంపెంగలు పొసంగించినటువంటి
హారువులౌనని కొనియాడవలయు
నరవిరులౌ పొన్నలలవరించిన యట్టి
నెఱజాణతనము వర్ణించవలయు

గీ. నలువనిర్మించె నను చెల్వు గలుగవలయు
నట్టిసురలకు మీకు నెంతైన పిలువ
ననుచుఁబలికెడి సరసుల కపుడు వీటఁ
బుప్పలావుల నవ్వులం బులకలొదవు. 75

మ తనియన్ మావులు పువ్వుఁదేనియలఁ గేదారంబుల న్నిచ్చలుం
జినుకం బ్రొద్దొకవన్నె నందు గళమ శ్రేణుల్ ఫలంబంది వే
వినతుల్ సల్పును వాటిపాదముల కుర్వింబ్రాలి లోకంబులక్
దనుబోషించిన వారిపట్ల మరివింతల్ గావు సన్మత్వముల్. 76

శా. వెంటం జాజులు కూరలన్నమును వేత్వేరం దగబూని తత్
ఘంటామార్గమునందు జాఁగటలచేతన్ బెట్టు చాటించి యిం
టింటం బాంధకులంబు నారయుచు నెంతే తృప్తిగావింతు రా
కంటంజెందక యుండ రేయిపగ లుత్కంటన్ నృపాజ్ఞాపరుల్.

చ. మలయజఘూని మేనమును మాపటి పూటలయందుఁ జల్లఁగా
జలకములాడి రింతులను సారెకు నప్పర వీథులెల్ల దా
వలగొని తెల్పు కేళి రసవాటులచెంగటి చంద్రకాంతపుం
గొలఁకుల నీటితావి విరికోటికి దూతికరీతిఁ జాతురిన్. 78

చ. మలయసమీర మప్పురముమాడువలందు రతాంత తాంతలా
చెలువలు దేర్చి లేఁజమట చిత్తడులం దొలగించి వాలు మై
వలచు సుగంధముల్ తన కవారణమై యొసఁగంగ ద్రిమ్మరుం
గలుగదె లోకమందు నుపకారికిఁ బ్రత్యుపకార మెన్నగన్.

శా. కంజాక్షీ హృదయానురంజన కళాగంధర్వ! గంధర్వభూ
మంజీరధ్వనిధాటి కాతిఘటనామం దేహ! మందేహతా
పుంజీభూతవిరోధి విద్రవవిధాంభోజాప్త! భోజాప్తవ
త్తంజాపట్టణ హారనాయకమణీ దామాంక! ధామాంకనా!

క. రామాభిరామ ధామా
ధామాధికభీత భూమిధవ కృతనామా
నామాంకితజయభూమా
భూమానితగుణ వసంత పుష్పారామా! 81

## అశ్వగతి - నిరోష్ఠ్యము

భూరమణీ మణిభాగ్యవశంవద భూరిభుజాయుగమానబలా
మారవిస్మృత్వరభాసముదిత్వర మంజిమసమ్మద భాగబలా
వారిరుహాప్తసమగ్ర రుచిప్రతి వాదిమహోపరిపాల్యబలా
వీరగుణావృతహృత్య సుహృత్ పృథివీధవదావిక్రమాణబలా

క. శ్రీ "ముద్దుచంద్రరేఖా"
ప్రేమ స్థేమాభిరామ! బిరుదాంకకథా
నామాంకిత శాత్రవభూ
భూమాపహవిజయ సమరపుంఖితపటహా! 83

గద్య. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర కరుణాకటాక్ష లబ్ధసిద్ధ సారస్వతనయ చెంగల్వ వెంకటార్యతనయ, విజయరాఘవ భూపప్రసాదాసాదిక వివిధరాజ చిహ్నచిహ్నిత భాగధేయ కాళయనామధేయ ప్రణీతంబైన రాజగోపాల విలాసంబను మహా ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము. 84



శ్రీరస్తు.

# శ్రీ రాజగోపాలవిలాసము.

## పంచమాశ్వాసము.

శ్రీలక్షితపదలక్షణ
చోళగజలదుర్గ సింధుశోషకఘోటీ
వేలాతిగఖురధూళి
దురాలాలితతేజ! విజయరాఘవభోజా! 1

గీ. అవధరింపుము సూతసంయమివరుండు
శౌనకునితోడ నిట్లను శౌరిమున్ను
చంపకారణ్యమునకును సంఘటించె
దక్షిణద్వారకా సంజ్ఞ ధన్యమతిని. 2

క. వినుమందుకు నితిహాసము
వినుతంబై సకలవేదవేద్యంబగుచున్
తనరారు నట్టికథ యే
వినుపించెద నిపుడు మిగుల వేడుకతోడన్. 3

క. అష్టోత్తర శతనిలయము
లిష్టమ్ములుహరికి నందు నెనిమిదియే యు
త్కృష్టములు వాటియందు వి
శిష్టము చంపకవనంబె శిష్టాచారా! 4

సీ. సౌరభ్యపరిభూత షట్పదపంక్తినా
హోమధూమము మిన్నులొరయుచుండ
కాషాయశాటికా ఖండమండలమునా
వికచకోకక విభావిభవ మఘుర

ఘనతపోమహిమ నిర్గతరజోగరిమనా
రాజత్తర పరాగరాజమలర
శ్రుతిపాఠసంతతోత్సుక శుకశ్రేణినా
సనవకోరకపత్ర సమితిదనర

గీ. మదనమార్గణ గణనయు మహిమమయ్యు
మదనమార్గణ విరహిత మహిమఁ జెలఁగు
రాజగోప పదధ్యాన రాజమాన
భక్తలోకావనంబు చంపకవనంబు. 5

గీ. అట్టి చంపకవనమున నఖిలమునులు
తపముఁ గావింప వారిలో ధన్యతముఁడు
వహ్నిముఖుఁడను సంయమివరుఁడు చెలఁగు
సతతగార్హస్థ్య సన్నుతాచారుఁడగుచు, 6

చ. అలమునిలోకచంద్రునకు నాత్మజులై జనియించి రెంచ గో
ప్రళయుఁడు గోభిలుండునను భవ్యచరిత్రులు వారిలోన గో
ప్రళయుఁడు పూర్వపుణ్యపరిపాకఫలంబున మించె నెంతయున్
జలరుహనాభ పాదజలజాత వినిశ్చలభక్తియుక్తుఁడై. 7

సీ. కల్యసాకల్య సంకల్పితస్నానంబు
సాంధ్యకృత్యంబును జపసమాధి
యగ్నిహోత్రము దేవతార్చనా విధియును
వేదపాఠంబును వినయగరిమ
మాధ్యందినాది సన్మానితాచారంబు
నభ్యాగతులకు మృష్టాన్నదాన
మర్హపురాణ సమాకర్ణనంబును
తద్గత బహువిధ ధర్మచింత

గీ. యనుదినంబును సహజకృత్యంబు గాఁగ
మేలుమేలని జగమెల్ల మెచ్చిపొగడ
బ్రహ్మవిద్యావిదుండు గోప్రళయమౌని
తపముగావించె శ్రీహరిఁ దలఁచిభక్తి. 8

మ బలునిష్ఠన్ మధువాసరాత్యయములన్ పంచాగ్నిమధ్యంబునన్
వలిగాడ్పుల్ నిగుడంగ బట్టబయిటన్ వర్షప్రకర్షంబునన్
పులకల్ జాదుకొనంగ శీతువున సంపూర్ణోదవాసంబునన్
చలనంబందక సల్పె నుగ్రతప ముత్సాహంబు సంధిల్లగన్. 9

క. నిరుపమనిష్ఠానిధి యగు
పరమ మునీంద్రుని తపఃప్రభావము మదిలోఁ
బరికించి పంకజాక్షుఁడు
కరుణకుపాత్రంబు సేయఁగౌతూహలియై. 10

సీ. గరుడితెక్కలగముల్ గగనసౌధమునకు
కనకంబు వ్రాయువాఁగరులు గాఁగ
పసిఁడిచేలచెఱంగు బర్హిబర్హంబను
మేఘంబునకుఁ గారుమెఱుఁగుఁ గాఁగ
కరుణాప్రవాహంబు కన్నుదమ్ములకును
పసిమించు మకరందరసము గాఁగ
మొలకనవ్వులు లచ్చిమోము జాబిల్లిపై
నెలకొన్న చిన్నివెన్నెలలు గాఁగ

గీ. గరుడగంధర్వగాయనీ గానమమర
నమరనాయకు లిరువంక లందుఁగొలువ
విలువలేనట్టి శృంగార విభవమెసఁగ
నంబుజాక్షుండు మునికిఁ బ్రత్యక్షమయ్యె. 11

మ ఘనని ష్ఠం దపమాచరించు మునిలోకశ్రేష్ఠుఁ డవ్వేళఁదా
కనుదమ్ముల్ వికసిల్లు చెంగటను సాక్షాత్కారముం జెందు న
వ్వనజాక్షున్ భువనైకరక్షకుని దుర్వారప్రభావోన్నతుం
గనియెన్ పెన్నిధిఁగన్న పేదగతి నుత్కంఠాతిరేకంబునన్. 12

సీ. బ్రహ్మాండభాండముల్ బంతులుగామాటి
కలదు లేదనునట్టి ఘనుఁడవీవ
పదునాల్గు జగములు భరియించి జలధుల
విహృతిసల్పిన మహామహుఁడవీవ
పొక్కిలి విరిదమ్మి భువనముల్ నిర్మించు
బుడుతనిగన్నట్టి ప్రోఢవీవ
పదిరూపములువూని పదిలంబుగాభూమి
కరుణఁగాచిన జదత్కర్తవీవ

గీ. మూఁడుమూర్తులు మెలఁగెడు మూర్తివీవ
వేదవేదాంతముల నిన్ను వెదకి వెదకి
కానకున్నట్టిపట్ల నీఘనత లెల్ల
వల్లవీజార! కొనియాడవశమె మాకు?. 13

గీ. వినతిగావించి యీరీతి వినుతిసేయు
మానిచంద్రునిఁ గనుగొని మాధవుండు
మించు నీనిష్ఠకునుఁ జాల మెచ్చినాఁడ
నడుగు మాశాస్యమయ్యది యనిన నతఁడు. 14

ఉ. వారిజనాభ! నీవు మును ద్వారకలోపల గోపగోపికా
వారము రుక్మిణీప్రముఖవారిజనేత్రలు సేవ సేయఁగా
వారిధితీరశైల వనవాటికలన్ విహరించునట్టి యా
మేరలు చంపకాటవిసమీపమునన్ మెఱయుంపు మింపుగన్. 15

గీ. అనుచు నమ్మౌని కోరినయట్లు సల్పి
వనజనాభుండు చంపకవనమునకును
దక్షిణద్వారకాభిఖ్యదయ నొసంగి
యతనిప్రార్థన నచ్చట నధివసించె. 16

క. అరీతి నధివసించిన
నారాయణదేవు చరణనళినమ్ములకుఁ
సారెకు నతులొనరింపుచు
ధీరవిచారుండు మౌనితిలకుఁడు పలికెన్. 17

వ. దేవా! దేవరవారు నిచ్చలునిచ్చట నధివసించుటవల్ల నుల్లంబు పల్లవితంబయ్యె నయ్యెడ నేఁగావించు తీర్థంబునకు వాయవ్యంబున బాణపాతపరిమిత ప్రదేశంబున నవిరళపరిమిళిత ప్రసవవిసర పరాగాభోగ విభావిభావనీయసాంధ్య వేళాతివేలాతి లంబిదీపశిఖా రేఖామోహావహా పాదలంబి శిఖాముఖాలక్ష్య సౌవర్ణవర్ణ జాలజాలకంబును నినంపాంసు సారలోభలోలుపస్వాంతభూనభోంతర నిరతయాతాయాత పరిశ్రాంత శశికాంత ప్రముఖామర వ్రాతసంజాత తాపత్రయనిదాఘ తాపగర్వసర్వస్వహరణ చణ వర్షావర్ష మధురమధు రసధారాదుర్దిన దినారంభంబుననగు చంపకంబు సదేశంబున నిదేశకారులై మార్కండేయ మాండవ్యమౌద్గల్య సనక సనందనసనత్కుమార సనత్సుజాతాది మౌనిసంఘంబుల సంఖ్యంబులుగా సవనం సవనంబులుసల్ప విమానీకృతదివ్య విమానంబగు విమానంబులగు బుస నివేశించి విశ్వరక్షణ వ్యీక్షణంబును విశ్వకర్మనిర్మితంబుననగు త్రిణతంబు ధరించి భవత్కటాక్షవీక్షణానుక్షణ కృతార్థంబుగ కృష్ణతీర్థంబుగావించి ఆభీర భీరుకుచ

శాత కుంభాకుంభ గుంభిత కుంకుమ పంకహారిద్రా ముద్రా ముద్రిత వీచికా సారంబగు కాసారంబుగావించిన నదిహారిద్రా నది యనంబరగు. భవదీయదివ్య విమానంబునకు బాణ పాతప్రమాణంబున. పశ్చిమంబున గోభిలప్రకల్పితంబైన భవ్యజ్ఞాప్రదంబగుచు విష్ణుపుష్కరిణియనంబరగ వరంబొసంగి బహుమునిప్రణీతంబులైన బహువిధతీర్థంబులకు పావనత్వంబు గల్పించి ద్వారకంగోరక పెన్నిధిరీతిసన్నిధానంబు సేయవలయు ననవుఁడు శ్రీవత్సలాంఛనుండు భక్తవాత్సల్యంబున నచ్చట నిచ్చ వసియించి బృందావనతరు బృందంబుల యమునాతీర కుంజపుంజంబుల గోపగోపికాగోకులంబును క్రీడాశైలతటాగా తటాగమ్ముల మరియునచ్చటి మహీతలమహిత విహారణవిహి తోపకరణమ్ముల దక్షిణద్వారకానగరయోజనాంతంబున నిరం తరంబుగనుండ నేమించి మించి మించినకరుణాకుహనా గోపా లుండు గోప్రళయగోభిలులకు మంత్రోపదేశంబు గావించి వారలయందుదయయుంచి యచ్చట వసియించె అందుగోప్రళ యుండు నందకధరపాదభజనానంద ధరుండై సాంగక్రతువిధాన సంశోధిత కల్మషుండై దక్షిణద్వారకావాస వాసవాసనావాసి తుండగుచు చక్రధరసాయుజ్య సామ్రాజ్యంబునొందె. అందలి గుణగణంబులు గణనాతిలంఘ్యంబులని మఱియు నిట్లనియె. 18

గీ. దక్షిణద్వారకాపుర స్థలమహాత్వ
మగ్నికల్పంబునను జెప్పెనందు బ్రహ్మ
తపముఁ జేసెను నిష్ట పద్మయునుహారిని
తలపునను గోరిఘననిష్టతపము జేసె. 19

క. వారిద్దఱి తపములకును
వారిజనాభుండు మెచ్చి వరమును దయచే
గోరంగనొసంగి మగుడఁగ
జేరెను వైకుంఠపురము చిత్తమెలర్పన్. 20

గీ. దక్షిణద్వారకాపుర స్థలము మహిమ
శౌనకమహర్షికిని సూతసంయమీంద్రుఁ
డంతయునుఁ దెల్పియచ్చట నతిశయిల్లు
నలహరిద్రానదినిఁజాల యభినుతించి. 21

చ. ఇలఁగల పాపసంఘముల కెందునునిష్కృతిఁ గల్గుగాని మేల్
దలఁపనిపాపకర్మని కృతఘ్నతకుఁ మఱిలేవు నిష్కృతుల్
తొలుతఁదొలంగినట్టి ఘనదోషము నొక్కధరాధినేతకుఁ
కల దితిహాసమొక్కటి ప్రకాశముసేసెద మీకు నెంతయుఁ.22

గీ. ఒనరు గోదావరీనది యుత్తరమున
సింధుసౌవీరమధ్య ప్రసిద్ధమగుచు
తేజమునమించి సౌరాష్ట్రదేశమందు
పుణ్యావర్తనుఁడొక మహీభుజుఁడు గలఁడు. 23

సీ. తనదు దుర్గాధిపత్యము లోకముననున్న
జననాథులకలంఘ్య శక్తిఁదెలుప
తనదు సర్వజ్ఞత్వ మనిశంబు జనముల
మనములలోనున్న మర్మమరయ
తనయుగ్రభావంబు దర్పితాహితవాస
పురములనొక్కట పొడవడంప
తనమహైశ్వర్యంబు తప్పకఁగొల్చిన
ధన్యులకును ధనదత్వమొసఁగ

గీ. తనరు తనలోక పాలకత్వప్రసిద్ధి
పరిజనులనెల్ల లోకపాలురుగఁ జేయ
రాజశేఖరుఁడనఁగ సౌరాష్ట్రదేశ
రాజశేఖరుఁడెంతయు రహివహించు. 24

క. ఆరాజశేఖరుండును
భూరమణుఁడు వేఁడలాడఁ బోవఁదలంపన్
నూరెలనున్న జనంబులు
సారెకుమృగయా విహార సన్నాహామునన్. 25

సీ. సివ్వంగిబండ్లును చిఱుతబలంబులు
మోటకత్తులు తెరల్ మోకురులు
పారెపాతెమ్ములు బదనికల్ తడకలు
చిలుకుటమ్ములు చల్దిచిక్కములును
వలలును బోనులు వల్లిత్రాళ్లొడిసెల్లు
సెలవిండ్లు దీనుముల్ జిగురుగడలు
వెటులుగ్రోవులుమనుల్ బిసలును డేగలు
వేపులునాదిగా వెలయునట్టి

గీ. వివిధసాధనముల వేఱువేఱఁబూని
యాగ్రహావ్యగ్రులై మృగయానుసక్తి
వెల్లివిరిసినసంద్రంబు విధమువిూఱ
నాటవికులెల్ల తనవెంట నంటికొలువ. 26

శా. వాహారోహమొనర్చి పార్శ్వయుగళిన్ పల్లత్కృపాణంబులన్
బాహాదండములొప్ప వీరరసతద్భావాను భావంబునన్
సాహాయ్యంబొనరించు రాచకొమరుల్ సన్నద్ధులై వెంటరా
సాహోయ్యంచును హెచ్చరించ విభుఁ డుత్సాహంబు సంధిల్లఁగన్.

గీ. వేయువిధముల వనములో వేఁటలాడి
యెపుడు మెప్పింతుమిక నెప్పుడెప్పుడనెడు
చెంచుదొరలునుఁ దానును చేరియచట
వేటలాడంగ దొడఁగె నుర్వీవిభుండు. 20

క. దండంబిడి చెంచొక వె
దండము తొండంబుపట్టి తా లాగింపన్
కొండవలెఁ బడియెదానము
మెండుగ సెలయేర్ల రీతి మేదినినిండన్. 29

గీ. లేటికెదురుగ రాఁబులి వేటసేయు
భూభుజా! యమ్ము రెంటిని బొలియఁజేయు
పులియు లేడియు సరిపడఁబోరిపడియె
ననరి శరవేగమెఱుఁగక యాటవికులు. 30

ఉ. దండితనంబుమీఱ భుజదండమునందగు నేజఁబూని వే
దండముఁ జేరఁబోయి వసుధాపతి దానిమరల్పదాని యా
దండ నయుండు కొండవడిదాఁకిన చప్పుడు విన్నయప్పుడే
కొండనుకొండదాఁకె కనుగొండని చూతురు భిల్లవల్లభుల్. 31

క. పులుగులుఁ జొరపిడి యొకరుఁడు
వలకేలను డేగబూని వైవగ నాసన్
వలగొన నదియును నవియునుఁ
ద్రోలఁగెను బహ్వాళవలన దొరకునె ఫలముల్. 32

గీ. జగతిగెలుపులచే కొనుచామరమ్ము
లధికసత్వంబులుండ నియ్యడవి వింటి
కేఁటికని చామరమ్ముల నెల్లగొనిరి
చమరులనుఁజేరి శూరులు చెమరుబలిమి. 33

శా. దానప్రౌఢిమనెంచి చూచినను భూదారత్వసంరూఢిచే
యేనాటందమినేమిటం గొదవయే మీాయమ్ము లాయమ్ములన్
త్క్ష్మానాథుం డిటులేయనేటి కనుగిన్కం గోలె కోలంబు లా
రా!నించెన్ ప్రతీగాగ రక్తశరధారాసారముల్ మీాఱఁగన్.

మ. వడిగా వెన్నున నిల్వనేసిన శరవ్రాతంబు నిండార నల్
గడలన్ మిన్నులురాయు కీచకశిఖాకాండప్రకాండంబుగా
పుడమింజాఱెడుక్రొత్తనెత్తురుల రొంపుల్ ధాతుపూరంబుగా
నడగొండల్వలె నుండె వన్యగజసంతానంబు లంతంతటన్. 35

సీ. ముంచియెత్తిన రొంపిముకుగోళ్లఁజిందెనా
గగనగంగకుఁ బంకగరిమఁజూప
చింతనిప్పులురాలు చిఱుతకన్నులడాలు
దావకీలలకునుఁ గైదండలొసఁగ
ఝాడించినిలిచిన స్తబ్ధరోమములచే
బ్రహ్మాండములు తూంట్లబానలుగను
ఘుఘున్రస్వనముల గుంభినీధరముల
గుహాలసింగంబుల గుండెలవియ

గీ. వలలచించుక చెంచులవశముగాక
యేకలం బొక్కఁ డుర్వీశు నెదుటనపుడు
ప్రళయకాల వరాహంబు పగిదిహెచ్చు
వచ్చినిలిచెను ప్రజలెల్ల విచ్చిపాఱ. 36

